ఆనందమందిరము. ౨

మంగిపూడి వేంకటశర్మ

సంపాదకుఁడు.

౧౮

"భక్తిజ్ఞానవైరాగ్యములే భారతీయుల జీవనమార్గము."




మంగిపూడి పురుషోత్తమశర్మ

శ్రీ

# స్వామి

# దయానందసరస్వతి

జీవితము—ఉపదేశములు.

## శ్రీ బాబు శివానంద ప్రసాద్ గారి

గ్రంథమున కనువాదము.

మొదటికూర్పు

రాజమహేంద్రవరము:

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాల,

1916

వెల రు ౧-౮-౦

# ప్రధానపోషకులు

౧ మ. రా. రా. శ్రీ అయ్యగారి రామారావుగారు బి. ఏ. బి. యల్.
౨ „ దేవభక్తుని సీతారామయ్యగారు మ్యునిసిపల్ చైరుమన్
3 „ ఒక భాషాభిమానిగారు.

# పో ష కు లు

౧ మ. రా. రా. శ్రీ ఉప్పులూరి వేంకటసుబ్బారావు పంతులుగారు సబుడ్వోవరుసీయరు.
౨ „ వాసిరెడ్డి వెట్టెయ్యగారు.
3 „ సూర్యదేవర రామానాయుడుగారు.
౪ „ సూర్యదేవర సుబ్బానాయుడుగారు.
౫ „ సూర్యదేవర లింగయ్యగారు.
„ వాసిరెడ్డి వేంకటపతిగారు.
౭ „ తల్లాప్రగడ సీతయ్యగారు బుల్లిసుబ్బారాయుడుగారు
౮ „ నిడమర్తి లక్ష్మీనరసింహముగారు.
౯ „ చట్టి నరసింహరావుగారు అగ్రహారందారు.
౧౦ „ సూరంపూడి సత్యనారాయణమూర్తిగారు.
౧౧ „ ఆచంట రామచంద్రశర్మగారు ఆయుర్వేద అగదంకారులు.
౧౨ „ కొలనువాడ వేంకటరామరాజుగారు.
౧3 „ దంతు కృష్ణంరాజుగారు.
౧౪ „ గాదిరాజు సీతాపతిరాజుగారు ఆయుర్వేదవైద్యులు.
౧౫ „ దాసం అచ్చయ్యగారి కుమారుడు వేంకటరామయ్యగారు.

౧౬ ,, కొల్లెపర పాపయ్యశ్రేష్ఠిగారు.
౧౭ ,, తుమ్మలపల్లి లక్ష్మీనారాయణగారు వర్తకులు.
౧౮ ,, తూతా వేంకటస్వామినాయుడుగారు వర్తకులు.
౧౯ ,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు బి. ఏ. బి. యల్.
౨౦ ,, మహాకాళి రామమూర్తిగారు.
౨౧ ,, చింతల రఘునాథరెడ్డిగారు ఆర్యసమాజప్రధాని
౨౨ ,, వీరపనేని బసవయ్యగారు గ్రామమునసఫ్ తాలూకా అండ్ జిల్లాబోర్డు మెంబరు.
౨౩ ,, వెల్లంకి కృష్ణమూర్తిగారు.
౨౪ ,, ఇందుకూరి చినవేంకటరాజుగారు అగ్రహారందారు

## స హా యు లు

౧ మ. రా. రా. శ్రీ ఆత్మకూరి చప్పయాచార్యులుగారు అగ్రహారందారు.
౨ ,, శాఖమూరి సూరయ్యగారు.
౩ ,, సూర్యదేవర సీతారామయ్యగారు.
౪ ,, చేపూరి నరసింహరావుగారు సాల్టు సబుయినస్పెక్టరు.
౫ ,, దేశిరాజు మురహరిరావుగారు.
౬ ,, మందరపు మృత్యుంజయకవిగారు.
౭ ,, పదుళ్ళపర్తి వేంకటరత్నముగారు.
౮ ,, ఆదూరి వేంకటసుబ్బారావుగారు.
౯ ,, పూళ్ళ వేంకటాచలపతిరావుగారు.
౧౦ ,, అమరవాది వేంకటకృష్ణమూర్తిగారు.
౧౧ ,, శ్రీ కుమార రాజా మంత్రిప్రగడ వేంకట హనుమంతరావుగారు.
౧౨ ,, దాసు గోవిందరావు పంతులుగారు బి.ఏ.బి.యల్.
౧౩ ,, గరికపాటి ఆంజనేయ సూర్యప్రకాశరావుగారు.

ఓమ్

# భూమిక



క్షీరసాగరమథనమునుండి లోకకల్యాణార్థమై అమృతము, లక్ష్మి, ఐరావతము, మున్నగు నమూల్యరత్నము లుద్భవించినట్లే యీనవభారత సంఘట్టనమున గూడ నొక మహాసీయమండలి యవతరించి యార్యావర్తమును తనసూత్రములన విశ్వమానవలోకమును ఉద్ధరించుటకై తోడ్పడి యున్నది. ఈజాతీయోద్ధారకపరంపరలోనెల్ల నొక్క మహాపురుషుడు తన పవిత్రచారిత్రముచే, ప్రాచీనవిజ్ఞానముచే, అప్రతిమప్రతిభచే, అసదృశ త్యాగముచే, విశాలహృదయముచే, యుక్తివిలోకనముచే, నిరుపమకార్యకౌశలముచే, నితాంతవీర్యముచే, ఉగ్రాభినివేశముచే నొక ప్రత్యేకాగ్రస్థాన మలంకరించుచున్నాడు. ఆతడే మహర్షి శ్రీస్వామిదయానంద సరస్వతి.

“జాతీయముగా నుండుటయన్న నిశ్చలముగా నుండుట కాదు. ప్రాచీనమునుండి యొక సారపదార్థమును సంగ్రహించి నవజీవనప్రవాహమున చొప్పించుటయే పునరుజ్జీవనమునకును పునర్నిర్మాణమునకును పటుతరసాధనము” అని శ్రీమాన్ అరవిందఘోసుమహాశయుడు వాక్రుచ్చియున్నాడు. ఈ యమూల్యసత్యము నెఱింగియే రామమోహనుడు తన జాతీయోద్యమమును ఉపనిషత్తులపై ప్రతిష్ఠాపించెను. ఈమర్మమును గుర్తించియే వివేకానందుడు జాతీయప్రబోధమునకై వేదాంతదుందుభిని మ్రోయించెను. అయితే యుపనిషత్తులును వేదాంతశాస్త్రమును ఆర్యుల జాతీయధనమగును గాని మూలధనము కానేరవు. ఆర్యజాతియొక్క యుత్తమాంగమగునుగాని హృదయకుహరము కానేరవు.

చతుస్సముద్రములవంటి యే సనాతనజ్ఞానకోశములనుండి తరతరములుగ మతమతాంతరము లుదయించి భారతజాతియొక్క సర్వాంగములయందును ప్రవహించుచు జాతీయజీవనమును పుష్కలముగ పోషించుచుండెనో గీతోపనిషత్తులు వేనియొక్క విస్ఫూర్జితనిశ్వాసములో షడ్దర్శనములుసహా యేవాని యుపజీవులో ఎయ్యవి యీశ్వరవాణిగా విశ్వసింపబడుచు భారతీయుల యకుంఠిత భక్తివిశ్వాసములకు పోటులేని మేటి కాణాచులై వారి సకలధర్మజీవనమునకు చరమ కాని పరమప్రమాణమగుచున్నవో అట్టి పవిత్రగంభీరవేదగ్రంథములే భారతజాతీయ హృదయమగునుగాని వేరొండు కానేరదు. ఈజాతీయహృదయముయొక్క యస్పందిత స్పందనమును అనాహతశబ్దమును అవిగీతగానమును విననోచినవాడే ధన్యుడు! విప్పిచెప్పినవాడే ధన్యతముడు!!

ఉపనిషత్తులనుగాక షడ్దర్శనములనుగాక సమగ్రవేదాంతశాస్త్రమునుగాక యిన్నింటికిని మూలకందమగు శ్రుతులసన్నిధికే సూటిగా నేగి వానిద్వారమును మరల నొకమారు తట్టి నిశ్శంకముగా సర్వజనులకును దెఱచి వానిని తన సంస్కరణోద్యమమునకు పునాదిగ గైకొనుట యందే దయానందుని జాతీయదృష్టియు మేధాపుష్టియు బహిర్గతమగుచున్నవి. మఱియు వేదములు పూర్వవ్యాఖ్యానముల వెలుగున జదువబడి * దృక్కోణవిభేదముచే పుక్కిటిపురాణములకును, పిట్టకథలకును, అసభ్యాంశములకును, నిలయములని నిరసింపబడుచున్నప్పుడు అనాగరికులగు నాదిమజాతుల తొక్కుడుపల్కులుగా మాత్రమే యూనంగింపబడుచున్నప్పుడు ఆయన తన గురువర్యుని యాదేశప్రకారమే కానిండు వేదవీణను నూత్నస్వరకల్పనలతో మీటి వేదములు విశుద్ధజ్ఞానగ్రంథములు కాని పుక్కిటిపురాణములును పిట్టకథలును కావని చాటియుండుట విశేషభావిఫలసంభరితము.

దయానందుడు కేవలభావుకుడు కాడు. ఆయన సంపూర్ణక్రియా పరతంత్రుడు. ఆయన కార్యోత్సాహమే ఆర్యసమాజరూపమును ధరించి యుత్తమలక్ష్యములతో విలసిల్లుచు దురాచారములను తుడిచివేయుచు భారతభూమిని స్వర్గసీమగా జేయ నుంకించుచున్నది ! ఈ యుద్యమతరంగ మొక్కటి యాంధ్రజనపదమధ్యమున గూడ బ్రాకి మెల్లమెల్లన జనసామాన్యముయొక్క మనసులను వశీకరించుకొనుచున్నది.

ఇట్టితరుణమున శ్రీస్వామివారి జీవితోపదేశములం గూర్చియు ఆర్యసమాజముం గూర్చియు విపులగ్రంథమొక్కటి యాంధ్రమున నుండుట యెంతయు నావశ్యకమని యెంచి యీగ్రంథమాత్మక ప్రాశస్త్యము న కోటువడుటచే యథాశక్తిగ దానిం దెనిగింప సాహసించితిని. వేడుటయే తడవుగా నాంధ్రీకరణమున కనుజ్ఞయొసగి నాయుద్యమమును దీవించిన వైదికపత్రికా సంపాదకులు శ్రీయుత రామదేవ బి. ఏ. యమ్. ఆర్. ఏ. యస్. గారికి నాకృతజ్ఞతావందనము లర్పించుచున్నాను. మఱియు నీగ్రంథపూరణమున తమ రచనలచే బాసటయైన శ్రీ సోమనాథరావు, భజ్జుసింగుగార్లకు నామన్ననలు తెలుపుకొనుచున్నాను.

వెండియు నీపొత్తమును వెలికిదెచ్చుటలో ప్రోత్సాహసాహాయ్యములొసంగిన ప్రియమిత్రులు శ్రీ వెల్లంకి కృష్ణమూర్తిగారికిని సహజౌదార్యముతో శ్రీస్వామివారి ఛాయాపటము దిమ్మనొసంగిన శ్రీకాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారికిని నాకృతజ్ఞతావందనములు వెలిబుచ్చుచున్నాను.

ఇక మూలగ్రంథకారున కీయాంధ్రీకరణమున నన్యాయముచేయకుంటయే నాకాశింపదగిన మహాసమ్మానము. ఇందెంతవఱకు చరితార్థుడనైతినో పాఠకోత్తములే నిర్ణయింపనర్హులు.

ఇందు నా స్వంతతప్పులకు తోడు ముద్రణాస్ఖాలిత్యములు కూడ మిక్కుటముగ దొరలుట సంభవించినది. ఆ దోషముల నేరి శుద్ధపత్రికగా గూర్చితిమి. పాఠకమహాశయులు ముందుగనే సవరించుకొని పదిలముగ గ్రంథమును పరిశీలింతురు గాక.

అనువాదకుడు.





# శ్రీ
# స్వామి దయానంద సరస్వతి.



## జీవితము—ఉపదేశములు

## ప్రథమభాగము

### ప్రథమాధ్యాయము

### ఉపక్రమణిక



మతమా రాజ్యతంత్రమా !

హితమునకో యహితమునకో కాని ప్రస్తుత కాలమున మన మహాపురుషుల భావములలో మతము కేవల సామాన్యస్థానమును రాజ్యతంత్రము ప్రధాన స్థానమును ఆక్రమించుచున్న దనుట నిర్వివాదాంశము. ఈ దేశమునందలి యుత్తమ పురుషులకు రాజ్యతంత్రమే మతమనియుం జెప్పిన జెప్పవచ్చును. ఇతరదేశముల మాట నుడువజాలను గాని హిందూదేశవిషయమున మాత్ర మిది యెంతయు శోచనీయము. హిందూదేశీయులింకను తాము మతము నతిగమించితిమని వచించుటకు సాహసింపజాలరు. వారు బుద్ధి పాటవమున మాత్రమే యైరోపీయ జాతికి గాని ఏ యమెరికా జనులకు గాని యావంతయు దీసిపోక పోయినను, అన్యవిషయములలో పాశ్చాత్య జాతులతోడనే కాదు క్రొన్ని

పాశ్చాత్యజాతులతోడను సామ్యమునకు రాజాలరు మన సంఘములోనికి బ్రాకిన చెనుగుల నన్నింటిని లెక్కింప దొరకొన్నచో విసుగు జనించును. కాని ఏ సంఘమున మతాంగీకారము క్రింద స్త్రీలకు విద్య యొసంగబడదో, ఏ సంఘమున మతానుమోదముక్రింద జన సామాన్య మజ్ఞాన నిమగ్నముగ నుంచబడుచున్నదో, ఏ సంఘమున మతాధికారము క్రింద ముప్పాతిక వంతు జనులు నీచులు గను స్పర్శ నా నర్హులుగను జూడబడు చున్నారో, ఏ సంఘమున నొక మనుజుఁడు తోడి మానవుని హస్తము నుండి యాహారమును గాని పానీయమును గాని గ్రహింప నొల్లక అట్లొనర్చుట తనకు స్వర్గద్వారమును దెరచు మహాకృత్యముగా గణించుచున్నాడో, ఆ సంఘము రాజకీయాధికారమున కర్హమగునా ? ఏ దేశమున మతోపదేశములును సంఘ ప్రయత్నములును 'ఎవరికి వారే' యనువ్యక్తిగత జీవనమును విధించుటలో పూర్ణముగ వినియోగింపబడియెనో ఆసంఘము రాజకీయాధికారమునకు పాత్రమగునా ? రాజకీయాధికారమున యదార్థమగు నధికారమును. శాసనాశక్తియు స్వపరిపాలనమును గాని శాసన నిర్మాణ సభలలో గూర్చుండుటకు సెలవు కాదు. ఈ 'యెవరికి వారే' ధర్మము సంఘమున జిరకాలముగ జీర్ణించుటచే, ఏ పురుషుడైనను స్త్రీ యైనను శిశువైనను రోగాక్రాంతుడై పడియున్నప్పుడు పరులెవ్వరున్ను స్వల్పముగ నైన నుపచారము గావించుటకు జనకుండుట మన దేశమున సర్వ సాధారణమై యున్నది. కొందఱు కొన్ని రాగినాణెములనో లేక వెండినాణెములనో యొసగి సహాయపడవచ్చును. కాని అంతకు మించి యెవ్వరును శ్రమపడుచుండగ నే నెన్నడును గాంచియుండలేదు. పడియున్న మనుజుని స్పర్శయే మైల యైనపుడు అతని కుపచారము చేయుట యెట్లు పొసగును. ఇటు లగుట మనవారికి హృదయము లేక కాదు. అందఱి వలెనే వారును జాలి నొందుదురు. కాని వారి ధర్మశాస్త్రము నిషేధము కాని విధికాదు. ఎవ్వరికిని హాని చేయకుండుటయే

తమ యుత్కృష్ట ధర్మమని వారు తలంచుచున్నారు. అట్లు తలంప బోధింపబడియున్నారు. ఈ నిషేధధర్మము విధాయకము. సేవన మన్ననో ఐచ్ఛికము. దీనికి సాధారణ ప్రాముఖ్యము మాత్రము కల్పింపబడినది. నీవు నీ దేశముకొఱకును నీ ప్రజలకొఱకును ఆత్మత్యాగ మొనర్చుట యున్నత్తతగను శుద్ధమూర్ఖత్వముగనుఇంతియ కాదు దైవముయొక్కయు మానవకోటియొక్కయు దృష్టిలో కేవలము పాపముగను నింద్యాము గను పరిగణింపబడుచున్నది. ఏలయన మనయేలిక యగు భగవంతుడు మన మొనరించు సకల కార్యములకును నియామకుడు గదా ! అతడు పుణ్య పాపములకు న్యాయమగు ఫల శిక్షల నొసంగును గదా ! కావున మనము న్యాయ శాసనముల నతిక్రమించిన వారిని అక్రమబాధితు లగు వారిని ఆ న్యాయమూర్తి విచారణమునకే వదలి యూరకుండవచ్చును.

అట్టి జనుల ప్రవృత్తిని ఉదాసీనతను మనము హృదయపూర్వకముగా బ్రశంసింతుము కాని వారి యధీనతకింద నున్న యేపరిపాలన మైనను మన జీవితములను సర్వస్వమును విడిచిపెట్టజాలము.

లోకము ప్రతియుగమునందును తాను నమ్మిన దైవమున కనుకూలముగ పరివర్తించుటకు ప్రయత్నించి యుండెను. అని యొక లేఖకుడు చక్కగా నుడివియున్నాడు.

బౌద్ధమత మధఃపతితమయి బ్రాహ్మణమతము మరల దల యెత్తినది మొదలు నేటివఱకును హిందూదేశము రాజకీయవిషయములలో మాంద్యముగ నుండుటకు గారణమేమి ? ఆమె పతనమునకు ఆమె తత్వశాస్త్రమును ఆమె మతమును ఆమె యాదర్శములును ఆమె జీవితనియమములును బాధ్యత వహించియున్నవి. మతమే రాజ్యతంత్రమును నడపించును. మతము వినా రాజ్యతంత్ర మసాధ్యము. మీ మార్గసూచక నియమ మెచ్చటినుండి వచ్చును ? మీ పరిపాలనాదర్శము లెయ్యవి ?

ఒప్పో తప్పో మతాధారము లేక యేపరిపాలనమును ఒక్కనాడేని కొన సాగజాలదు.

పై వివరించిన వాదమునకు ప్రతిగా ఐరోపాను గాని అమెరికాను గాని చూపవచ్చును. వారు మతమును రాజ్యతంత్రమును కొంతవరకు వేర్వేరుగా నుంచిరి. ఏ యైరోపాదేశీయ మతమును గూర్చియు రాజ్య తంత్రమును గూర్చియు నేను స్వయముగా నేమియు నెఱుగను. అయి నను ఐరోపాయొక్క ప్రస్తుత రాజ్యాంగ వ్యవహారములలో మతమున కెట్టి స్థలమును లేదని నే నెన్నడును విశ్వసింపజాలను. తుర్కీ బల్గేరియా యుద్ధములో మతపక్షపాతము తావు చేసికొనలేదా? శిలువకును నెలవం కకును జరిగిన యీ సంగ్రామ విషయమును విచారించుటలో యూరో పు మతాభిమానమును జూపియుండలేదా?

అయితే హిందూదేశములోని యాంగ్లేయప్రభుత్వము మత ముతో నెట్టి జోక్యమును లేకయే పాలనము జేయుట సాధ్యమని నిరూ పించిన దని కొంద ఱనవచ్చును.

అట్లైనచో సహగమన దురాచార మేల తొలగించబడెను. బాలిసతన మేల శిక్షార్హముగ జేయబడెను? శూద్రజాతులకు బ్రాహ్మ క్షత్రియులతో సమానస్వత్వము లేల యొసంగబడినవి? ఉన్నతవర్గము లపై గూరుచుండి తీరుమానము చెప్పుటకు చాకలి యేల దండనాధి కారిగా నియమింపబడుచున్నాడు? భూసురులును మాల మాదిగలును ఒకేచెరయం దుంచబడి యేల సర్వవిషయములందును సమానులుగ జూడబడుచున్నారు? ఈ దేశములోని కొన్ని యాచారములును కొన్ని విశేష స్వామ్యములును అన్యాయములనియు పరమేశ్వరుని సంతానమున కమిత కష్టదాయకములనియు ఆంగ్లేయులు తలంపనిచో వీనిలో నొక్క కార్య మేనియు జరిగియుండ నేరదు. అట్టి యాచారములను శిరసా వహించుటకు గాని తిరస్కరించుటకు గాని మనలను పురికొల్పునది

మతము కాక మఱియొయ్యది ? మత మొనర్చు పనులు మిగుల నీతిమ లైనవి. దాని ప్రభావము మిగుల శక్తిమంతము. కాని నిగూఢము. బ్రిటిషు ప్రభుత్వ మెంత తటస్థముగ నున్నను క్రైస్తవ పరిపాలనా భావ మనుగడుగునను వ్యక్తమగుచున్నది. హిందువుల రాజకీయాధికార మదృశ్యమయినను కలుషిత మత ప్రాబల్యము లెల్లయెడలను దృశ్యము లగు చున్నవి. తినుబండారముల లోనికి జొరబడు మాలిన్యమును విషమును సరకు గొనక బాట ప్రక్క దన సరకులను విక్రయమునకు బెట్టు మడ్డి మిఠాయి వర్తకుడు హిందూధర్మమున ఫలించిన ఫలమే కాదా ?

మతము తొలుతను రాజ్యతంత్రము పిమ్మటను పరిగణింపబడ వలె నని నుడువుచున్నాను. కావున మీ జీవితమును నడపించు లక్ష్యములను గూర్చియు ప్రవర్తనా నియమములను గూర్చియు విస్పష్టభావనము లేనిచో మీరే పరిపాలనమును జయప్రదముగ నిర్వహింపజాలరని మీకు నచ్చజెప్ప గోరుచున్నాను కొన్ని యుదాహరణములను దీసికొనుడు. మీకు వర్ణమునందు నమ్మకము గలదా ? ఉన్నచో మీ రొక రక్షకభట సంఘమును గాని సైనికపటలమును గాని నిర్మింపజాలరని నిశ్చయముగ నమ్ముడు. మీరు సముద్రయానము నంగీకరింపరా? అయిన చో మీ రెన్నడును స్వదేశవర్తకమును గూర్చియు విదేశవాణిజ్యము గూర్చియు దలంపకుండుడు. మీరు బాల్యవివాహములకు సమ్మతింతురా? ఐనయెడల మీగృహము ఆరోగ్యమును సంరక్షించుట కుత్తమయోధులను మీరు సంపాదింపజాలరు. మీరు స్త్రీవిద్యకు ప్రతికక్షులా? ఐన చో మీ సంసారజీవితము సుఖముగ నుండనేరదు. మీ స్త్రీల నైరోపీయ కాంతలవలె వారి దినవ్యయమును సంపాదించుకొన నిచ్చెదరా ? అటు లైన స్త్రీ స్వాతంత్ర్య సమస్యా పరిష్కారమునకు సంసిద్ధులై యుండ వలెను. మీరు మీ స్త్రీల ఘోషాపద్ధతిని విడనాడి యూరోపునందు వలె వారికి స్వేచ్ఛ నొసంగెదరా ? అయినయెడల దాంపత్య విచ్ఛేదక

న్యాయస్థానములను సత్వరముగ స్థాపింపవలయును. "ప్రస్తుత వ్యవహారములనుండి యుదాహరణముకొఱకు ప్రజాసేవా విచారణ సంఘము (పబ్లికు సర్వీసు కమీషను) చేయబూనుకొన్న కార్యవిధానమును గ్రహింపుదము. ప్రజాసేవ నేటివలె ద్రవ్యముపై గాక గౌరవముపై నాధారపడి యుండినచో ఏమి తటస్థించునో చక్కగా యోజింపుము. ప్రజాసేవకునకును ఆతని కుటుంబమునకును వలయు వ్యయము తప్పక యిచ్చితీరవలయును. కాని ప్రస్తుతము మన దేశమునందలి క్రైస్తవమత ప్రచారకుల కిచ్చు పద్ధతి నొసంగుము. పూర్వపక్షికిని పారితోషిక ఉపాయనముల రూపమున ధనమునుగాక పదార్థములనె గౌరవపూర్వకముగ నొసంగుము. ఉద్యోగోన్నతి ననుసరించి యాదరమును అధికారమును పెంపుసేయుము. అట్లైనచో నేమి సంభవించును ? ఏకకాల పరీక్షలు, వేతనపరిమితులు, జాతి మతశాఖల సమాన ప్రత్యేక ప్రాతినిధ్యము, కార్య నిర్వాహక న్యాయ విచారణ శాఖావిభాగము వీనిం గూర్చిన నిరంతర వివాదములన్నియు నొక్కక్షణములో నదృశ్యమై పోవును. ఏలయన ప్రజాసేవయొక్క పూర్ణభావము గాఢమగు స్వార్థపరత్వమునుండి యథార్థమగు ప్రజాసేవగా పరిణమించును." * ఈవిషయమై యింకను జర్చింపవలయునా ? మూలాదర్శములే ప్రపంచమును సర్వదా పరిపాలించినవి. మీరు కార్యాచరణమునకు గడంగుటకు పూర్వము మీ ప్రధానాదర్శములను గూర్చి శ్రద్ధ తీసికొనవలయును.

నే నింకొకయాక్షేపణము నెదుర్కొనవలసియున్నది. ఆఫ్గనులును టిబెటీయులును, నేపాళదేశస్థులును, రాజకీయాధికారమును చలాయించుటకు హిందువులకంటె నెక్కువయోగ్యత గలిగియున్నారా యని నన్ను బ్రశ్నింపవచ్చును. ఈ ప్రశ్నకు 'అవు' నని ప్రత్యుత్తర మిచ్చుటకు

* శ్రీయుత భగవాన్‌దాసు యం.ఏ. గారు గురుకులమునుండి వెలువడు వైదికపత్రికలో వ్రాసిన వ్యాసమునుండి కైకొనబడినది.

నేను సుంతయైన వెనుదీయను. వారు హిందువులకంటె విద్యలోను నాగరికతలోను నిమ్నస్థితిలో నున్నారనవచ్చును. కాని వారు నిశ్చయముగ రాజ్యాంగాధికారమునకు విశేషయోగ్యత కలిగియున్నారు. వారు స్వరాజ్యసంరక్షణ మొనరించుకొన జాలిరనుటయే వారి యర్హతను ఘంటాపథముగ జాటుచున్నది. నిజమునకు వారికి మనకంటె నదనముగ నొకటి రెండు సద్గుణములు లేవా? వారు స్వదేశమును స్వదేశీయులను స్వకీయ స్వత్వములను మనకంటె నధికతరముగ ప్రేమించుట లేదా? నైచ్యము, ద్రోహము, పగ, స్వార్థాన్వేషణము ఈదుర్గుణములే హిందూదేశమును నాశనము చేసినవి. ఇయ్యవియే మనలను మన ప్రస్తుత దుస్థితికి దెచ్చి యధమాధములనుగా జేసివైచినవి. నిస్స్వార్థతయే సమస్తసద్గుణముల కును మూలము. నిస్స్వార్థతయే మహత్త్వము. ధార్మికత్వమే యోగ్యత. ఇవి రెండు నెచ్చట విలుప్తమగునో యచ్చటి కెట్టియధికారమును రా జాలదు. వచ్చియు నిలువజాలదు. ఆహా! మీాభేదముల నణగద్రొక్కి కొని యెల్లరకును సమాన శత్రువెత్తి వచ్చినప్పుడు ధైర్యముతోడను ఐకమత్యముతోడను మాఱ్కొనుట యెట్టి సంస్తవనీయమగు సద్గుణము! హిందువులు పరస్పరాపరాధములను బొత్తిగా క్షమింపజాలని నీచమానసులగుటచే వారిట్టి సుగుణరత్నము నాచరణములోనికి దెచ్చుట దుస్సాధ్యమని కొన్నివేళలయందు దలంచుచుందును. మనమీా దుర్గుణముల నన్నింటిని సమయించినం గాని రాజ్యాంగాధికారమునకు పాత్రులము కాజాలము.

మత మావశ్యకమా?

ఈ దినములలో మత మత్యంతము తృణీకరింపబడుచున్నది. చాల మంది మత మనావశ్యకమందురు. కొందఱది యపాయకరమని కూడ చెప్పుదురు. కొందఱి భావమున నది యజ్ఞానమును మూర్ఖత్వమును మఱికొందఱు దానిని సంకుచితత్వముగను మతాంధతగను ఉన్మత్తతగను

భావించుదురు. మతముపేరిటను మతప్రాబల్యమునను ఎన్ని ఘోరకృత్యములు జరుగలేదు ? మతచరిత్రయంతయు. యుద్ధములు హత్యలు వ్యభిచారము మున్నగు నీచాతినీచములగు మారణకృత్యముల రక్తముచే నెట్టనయి జుగుప్సాకరముగ నున్నది.

అయితే ఇదియంతయు మతముయొక్క దోషమేనా ? లేక దాని యుసుగున నేమేని చెఱగు కలదా ? లేక దాని నపవిత్రము చేయునది మానవదౌర్బల్యమా ? మతమే హానికరమైనచో ధనమును విద్యయు నధికారమును ఇట్టులే హానికరములని చెప్పవచ్చును. ఏలయన, అన్ని యుగములందును అన్ని దేశములయందును ధనికులు విద్యావంతులు అధికారులునే ప్రజల నణగద్రొక్కి బాధించియుండిరి.

అజ్ఞానదినములలో మనుజుడు తనకు ఘటస్థించు నదృష్టదురదృష్టములు ఎక్కడనో మేఘములలోనో శైలోపరినో వాహినీగర్భముననో నివసించుచు మానవవాంఛలను గలిగియుండిన యొక యదృశ్యమహాశక్తియొక్క యనుగ్రహానుగ్రహములవలన గలుగుచుండెనని విశ్వసించుచుండెను. ఈనాటి నాగరిక పురుషుడు—సూటును బూటును నెక్టైని ధరించి పదియంతస్థుల మేడలో నివసించుచు మోటారు బండిమీదనో వాయు విమానముమీదనో సంచరించుచు మాంససారమును మధుర రసాయనములను భుజించుచు జీవించు ఈనాటి నాగరిక పురుషుడు తన యిష్టానుసారముగ వృష్టిని క్షామమును జాడ్యములను మన కొసంగు దైవ మొక డున్నాడని నిశ్చయముగ నమ్మజాలడు. అతడు ప్లేగురోగమును టీకారసముతో బారద్రోలగలడు. క్షామమును తన యినుప దారులవలనను పొగయోడల మూలమునను దూరము చేయగలడు. నాస్తికు డీశ్వర దూషణ మొనర్చుచుండగా నాతని తల వ్రక్కలు కాదు. అతని నాలుక చీలికలు కాదు. అతడు మూర్ఛచేనైన నేల గూలడు. 'యావ జ్జీవితమును భగవత్కైంకర్యముననే గడపిన వాడును దైవమును

మఱచి జీవించిన వానివలెనే వ్యాధి బాధితుడయి మృత్యువువాత బడు చున్నాడు. పూర్ణధ్యానమునను నిశీథప్రార్థనములను కాలమువ్యర్థము చేసిన వానివలెనే హాంతయు తస్కరుడును హాయిగా కాలక్షేపము చేయుచున్నారు.—ఇదియంతయు నాతడు పరికించుచున్నాడు. జీవితమున నీశ్వరునికి భయపడవలసిన యవసర మిసుమంతయేని గాన్పింపదు. పర మేశ్వరునితో నిమిత్తము లేకయే యాతడు జీవింపగలడు.

కాని ఆతడును తన శాంత నిమిషములలో దన హృదయమును పరిశీలించి చూడకొనును. ఆతడును—అనాగరికుడును శూన్యభావ మున ముగ్ధుడగును; తన బుద్ధియు హృదయమును నీతి మతములు వినా వ్యర్థమనియు నిస్సారమనియు నీచమనియు దలంచును. చింతనాశీలు డగు ప్రతి మానవునకును 'ఏల? ఎటనుండి?' అను నీ నిరంతర సమస్య మనస్సు నెదుట నిలుచుండి పరిష్కారమును గోరి తీరును.

సమగ్రముగ నాస్తికజీవనమును గడపుట సాధ్యమే. నిక్కముగా పెక్కుమంది యట్లు గడపుదురు. మనము, విద్య, గానము, చిత్రలేఖనము శిల్పము పొగబండి పొగయోడ పరిణయము—ఏవియు లేకుండగనే, ఏస్వత్వములును శాసనములును శూన్యముగనే జీవింపజాలునట్లులే యీశ్వరుడు లేకయు బ్రదుకగలము. అందాశ్చర్యమేమి? మన మాటవికులవలె జీవింపజాలమని యెవ రనగలరు? కాని యట్టిజీవనము వలన మనకు సంతృప్తికలుగునా?

మన మనుపమేయములగు నుత్తమ మానసిక శక్తి యుక్తుల మనుట నిక నుపేక్షింపజాలము. మనము ఉచ్చతరమును మాన్యతర మును నగు భవితవ్యమును నెరవేర్చుటకు సమయము వచ్చిన దను భావము నిక నణచిపెట్టజాలము. అయినను మనమిట్టి యుత్తమ పద మధిరోహించుట విస్మరించుచున్నారము.

మతము మనకు పుట్టుకతోడనే నైసర్గికముగ వచ్చుచున్నదనియు దాని నానవాలైన లేకుండ దుడిచివేయుజాలమనియు మనము మఱచుచున్నాము. ఈసహజగుణము వికసనము పొందని హృదయ మచ్చటచ్చట పొడగట్టవచ్చును. కాని మానవలోకము దానిని దోసివేయజాలదు. అది మిక్కిలి లోతుగ వేళ్లు పాతుకొని యున్నది.

మతమే నీతికి మూలకందము. ఒకటి పోవలసినచో రెండవదియు జిరకాలము నిలువజాలదు.

మత మనావశ్యక మనియు హానికరమనియు జెప్పెడు విపరీత సిద్ధాంతముయొక్క ఫలము విశ్వప్రపంచము దాని నవలంబించి నప్పుడే మన మనుభవపూర్వకముగ దెలియ గలము. నేను మత వలయము నతిక్రమించితినని వచించువారే నాడు పురాతన పరిస్థితుల పునరాగమనమును ప్రప్రథమమున గాంక్షింతురు. ఇతర మానవకోటియంతయు మతమును నీతిని క్రమమును అవలంబించుచున్నది. కావున నీవు వాని నవలదోసి నిరంకుశమగు నీ యిచ్చ తక్క యే శాసనమును లెక్కగొనక స్వచ్ఛంద విహారము చేయవచ్చును—చేయగలవు. కాని యితర జనులును నీతో సమముగ సంశయవాద నాస్తికత్వముల నాయుధములుగ ధరించినప్పుడు ప్రతిమనుజుడును నీవలెనే ప్రవర్తింపుచు తన జీవిత పరమార్థము పరు లేమైనను తాను మాత్రము విశేషలాభము పొందుటయే యని తలంప దొడగినప్పుడు, పృథ్వి యంతయు నల్లకల్లోలమయి నిశీథమువలె నంధకారముగను రణరంగమువలె పంకిలముగను నుండును.

మనము మానుషత్వమునుండి పశుత్వమున కొకయడుగు క్రిందికి వైచిన యెడలను, జీవించుట భుజించుట మరణించుట మాత్రమే మనకు చాలినయెడలను మనకు మత మనావశ్యక మగును.

కాని ఉన్నతజీవనమునకు మతమత్యావశ్యకము. అందు మన మెఱుగకున్నను అంగీకరింపకున్నను యథార్థముగా మనకొక మతము కలదు.

మత ముత్తమ భావములను సత్కృత్యములను పురికొల్పును. మతమే మన జీవితమునకు సాంత్వనము. కష్టసమయములలో మనకు బల మొసంగునది మత మొక్కటియే. మతమునుండి భిన్నముగ నుత్తమ జీవన ముండనేరదు. ఉత్తమజీవనము కాంక్షించు త్యాగ మొనర్చుటకు వలయు నుత్సాహమును మతము మాత్రమే యొసగగలదు.

పరమేశ్వరుఁడును భావిజన్మమును నాస్తి యగునెడలను, ఈప్రపంచమును మనమును తాత్కాలిక చైతన్యాభిజ్ఞానములతో గూడిన యాదృచ్ఛిక సమ్మేళన మగునెడలను,—ఇది యెట్లులో యేలనో యెఱుగజాలము—కొంతకాలము గతించిన పిదప గతము యొక్కయు అనాగతముయొక్కయు గుఱుతైన గానరాకుండ సర్వము నదృశ్యమగునెడలను ఈజీవితముయొక్క యుద్వేగ విచారములతో మనము క్లేశమందుట వట్టి పిచ్చితనముగ నుండును. మనము మనలను గాని మన యాత్మోపభోగమున కవరోధముగనుండు పరులనుగాని తుపాకితో గాల్చవచ్చును. ఏలయన అప్పుడు మన జీవితము న కర్థము ఆత్మభోగమునకంటె నన్యము కాకుండును. మనలోని ప్రతివాడును విశ్వప్రపంచమును స్వప్రయోజనానుకూలముగ నుండునట్లుల నిర్బంధించుటలో న్యాయవంతుఁ డగును. అప్పుడు నెపోలియను చక్రవర్తియే మన యథార్థప్రవర్తక యగును.

మనము ప్రకృతిపై నధికార మొనర్పజాలము. మనలో నొకరిద్దఱు అసంగతాభిప్రాయములను గలిగియుండవచ్చును. దేవుఁడు లేడనవచ్చును. నీతిని నిరసించవచ్చును. కాని విశేషజనము యథాస్థితి పక్షపాతులుగనే యుండి తమ కంటితనమును విపరీతభావములను లోకానురాగమును దైవభయమును గలిగియుందురు. ఏలయన యథాస్థితి

పరాయణత్వమునందును దాని సంజీవప్రదమును దృఢకరమును నగు సత్యాంశము కలదు.

సందేహవాదము మానవజాతి వలెనే మిగుల పురాతనమైనది. అది జ్ఞాన మరంద పాత్రమునందలి మక్షికము. విద్యా గులాబీపుష్పము నందలి కంటకము. దానిని మనము పరిత్యజింపజాలము. జ్ఞానము నుండి దానిని వేరుచేయజాలము. అది మనప్రకృతియం దొకభాగము. అది యాలోచించుటకును వృద్ధిపొందుటకును మనకు దోడ్పడును. కాని దానిని సాహాయ్యముగ గైకొనుటకు మారుగ దాని కధీనులయి దాని నొకదైవమువలె దలంచువారును కొందఱు గలరు.

అనేకరూపములుగ నున్న యీప్రపంచమున మనమును అనేక విధములుగ నుండకతీరదు. ప్రకృతిపురుషులను అజ్ఞాన జ్ఞానములను ఉభయమును గలిగిన మనము కేవల మేదియో యొక్కటిగ నుండజాలము. మనము సంశయవాదులమును ఆస్తికులమును గూడ గావలయును. అది విరుద్ధముగ గాన్పించును. కాని మనుజుడు 'విరుద్ధధర్మముల సమాహారమే కాదా? అత డప్రమేయుడును అచింత్యుడును గాడా?

సంపూర్ణముగ నైతిక మార్గమవలంబించు సంశయవాదులును నీతిని దొక్కివేయుచు సంచరించు ఆస్తికులును గలరు. ఇట్లుండుటకు గారణమేమి? సంశయవాది కాని ఆస్తికుడు కాని తన సిద్ధాంతముల కనుగుణముగ బ్రవర్తింపజాలకున్నాడనుటయే. ఇట్లుండ సందేహవాదమును ధర్మానుష్ఠానమును గురించిన మనయుద్దేశములు విశేషవ్యత్యాసము కలవగుటచే నిజముగా వైరుధ్యము లేనిచోట మనము విరోధమును గాంచుచున్నారము. మన యోచనలను అభిప్రాయములను వ్యక్తముచేయుటయందలి మన యసమర్థతయే మన యపగ్రహణమునకు గారణము. లోకము మనలను నిరంతరమును అపనిర్ణయము చేయుచు

న్నది. మన మేపక్షమువారమును గాకున్నను కించిన్మాత్రము సంశయ వాదులమే యైనను మనలను శుద్ధసంశయవాదులుగ నెంచుచున్నది.

మనము స్వర్గనరకము లనెడు ప్రాచీనాభిప్రాయములను విశ్వసింపక పోవచ్చును. మరణానంతర జీవితము ఇహలోక జీవితముయొక్క ప్రతిరూపముగ నుండకపోవచ్చును. అమృతత్వముయొక్క భావము నిత్య పారితోషికోప భోగముగాని శాశ్వత శిక్షానుభవము గాని కాకుండ వచ్చును. పునర్జన్మ సిద్ధాంతము మన కభిమతము కాకపోవచ్చును. మన ప్రస్తుత శిక్షణము జ్ఞానము గూడి ఈ సమస్తవిషయముల గూర్చియు సంశయముల గల్పింపవచ్చును. కాని జీవితము మరణము తోడనే యంత్యమగుచున్నదని స్థిరీకరింపబడినదా ? లేదు. అట్లెన్నడును స్థిరీకరింపబడకుండుటయె కాక తన్ముఖములగు నఖిలప్రయత్నముల యెడలను మానవసంఘము తన యనుమతిని శుభ్రతపరచి యజ్ఞేయుడగు పరమేశ్వరుని యందలి తన విశ్వాసమును ప్రకటించియున్నది. మానవాత్మ యుత్తరజన్మమున రక్తమాంస యుక్తమగు శరీరమును ధరించునో లేక సూక్ష్మతరమగు దేహాంతరమున బొడమునో సునిశ్చితజ్ఞానము నుడువజాలదు. సహజ జ్ఞానోపేతమగునట్టియు, అనేక సహస్రవర్షముల యనుభవజ్ఞానము గలిగినట్టియు జనవాక్య మేమేని పరిగణింపబడునెడలను, ఉత్తమమేధావుల యొక్క యు ఉత్కృష్ట మనస్కులయొక్కయు విస్పష్టోపదేశము లాదరింపబడునెడలను, మనమొక మహత్తరశక్తియందలి ఒక మహత్తర చైతన్యమునందలి విశ్వాసమును మానజాలము.

వైజ్ఞానిక మతము:—

ఒక ప్రత్యేక మతస్వరూపము కాలక్రమముగ ధర్మాపభ్రంశము నొందుచు కృశించుచు నశించినచో అది యామతదోషము కానేరదు. ఈ విశ్వమునందలి ప్రతిపదార్థముయొక్క గతియు నంతియే. మతముపై మనము దోషారోపణ మొనర్చినచో వార్ధక్యమున కెదిగి దౌర్బల్యమున

క్రొదిగి రోగమున సోలి కడకు మృత్యువుయొక్క భీకరకరస్పర్శచే నేల రాలునంతులకు మన శరీరము మీదను మనము నేరము నారోపింప వచ్చును.

ఒక మతము మానవసంఘ మొకయుగము మీదికి వైచినప్పుడు వారధిగమించిన నూతనపదమున కనుగుణముగ మార్గప్రదర్శకముగ నుండి స్వధర్మము నిర్వహింపజాలనిదో నయ్యది యంతరించును. విధ్వస్త మగును.

కావున ప్రాచీనార్యధర్మము కాలానుకూలముగ లేదనియు, మానవ మనోభీష్టములను సంతృప్తిపరుపజాలదనియు, గనుగొనిన తోడనే యొక నూతన యుగ మేతెంచినది. ఏకేశ్వరవాదముయొక్క సారమును భావమును ఆప్రాక్తనమతమునం దింకనునంశి యుండవచ్చును. కాని క్రూరయాగములును ఉగ్రతపస్సులును దాని కూపిరి సలుపకుండజేసెను. అంతట గౌతమబుద్ధు డావశ్యకమయ్యెను. ఆయన యవతరించెను. ఆయన లోకస్థితిని పరివర్తించెను. ఆయన మతమును దరీకాంతారముల నుండి మనుష్యావాసములకును, భౌతికనిగ్రహమునుండి నైతికనియంత్రణమునకును అనలసపరోపకారమునకును గొనివచ్చెను. భారతవర్షము ప్రబోధమొందెను. అభ్యుదయము గాంచెను. సామ్రాజ్యమై ప్రకాశించెను. అంతవిస్తీర్ణమును ఉదారమును శ్రేయఃకరమును శోభావంతమును నగు సామ్రాజ్యమీ భువనచారిత్రమున గడు నరుదుగ మాత్రము గాన్పించును. బౌద్ధుడంతటి మహారాష్ట్రమును నిర్మింపజాలినది ఖడ్గధారచేతను ఆగ్నేయాస్త్రముచేతను గాదు. అతడు జయింపగలిగినది ప్రేమచేతనే. వేదకాలము వాఙ్మయతత్త్వశాస్త్రములలో గాంచిన యభివృద్ధిని బట్టి యుచ్చతరమని చెప్పవచ్చును. కాని రాజకీయాధికారమునను ప్రాముఖ్యమునను బౌద్ధయుగమే యశఃపతాకమును వహించి యున్నది. ఈతరుణముననే మానవహృదయమున విశ్వమానవ సౌదర్య

భావ ముదయించినటుల గన్పట్టుచున్నది. అజ్ఞానతమః పరివృతములగు సీమలకు నూతన తేజఃపుంజమును గొంపోవుటకు సముద్రమును తరించి విదేశయాన మొనర్చినవారిలో బౌద్ధధర్మ ప్రచారకులే ప్రాయికముగ ప్రథములై యుందురు.

కాని యఖిలమునకును ప్రాపించు నట్టులే దీనికిని అంతము తటస్థించెను. బౌద్ధమతము క్షీణించెను. చైతన్యము గతించెను. గతకాల వైభవమునకు సాక్ష్య మొసంగుటకు శుష్కశల్యములు మాత్రము శేషించియుండెను. బౌద్ధధర్మము కడుంగడు భావశూన్యమును నిరాశావాదకము నగుటచే మానవ మనోవాంఛలను పరితృప్తి పరుపజాలదు. ఆత్మయొక్క యస్తిత్వమును నిరాకరించునట్టియు, ఒక మహత్తర శక్తిని నిర్దేశింపనట్టియు, వినాశమునందే తన పరమావధిని గాంచునట్టియు, ప్రవర్తనానియామకమును అత్యంత కఠినమును నగు నీతి సంహితా ద్వారమున నిర్వాణ మొసంగు నట్టియు మత మెన్నడును సామాన్య జన హృదయము నాకర్షింపజాలదు. అయ్యది యేమహాపురుషునియొక్కయో యేమహారాజుయొక్కయో యవలంబన మంతరించినతోడనే యదృశ్యమై తీరును. లేదా యధఃపతనము చెందును. అది యుత్కృష్టప్రభావులును అల్ప సంఖ్యాకులును నగు విశిష్టమానవుల నిమిత్తమే కాని సామాన్యులకొఱకు గాదు.

ఖడ్గమతము:—

బౌద్ధమతము క్షీణించి బ్రాహ్మణమతము మరల తలయెత్తిన పిదప హిందూదేశము గ్లాని మాంద్యములలో మునిగి యుండెను, వార్థక్య మామెపై బీటవెట్టుకొనినట్లాయెను. సమస్తోద్యమములు నస్తమించెను. క్వాచిత్కముగ దృశ్యమగు కార్యోత్సాహ మధోముఖమును బట్టెను. ప్రజలు నానాట దైన్య నిమగ్నులగుచుండిరి. సర్వవిషయములును నికృష్టమునుండి నికృష్టతరమునకు బరిణమించెను. నాడు ప్రజా

హృదయమును పాలించిన యాదర్శము లా కాలపు వాఙ్మయమునం దభివ్యక్తము కాగలవు. ధర్మము హీనమగు ప్రతిమారాధనమును దుర్వర్తనమును నంగీకరించి వానికి పవిత్రభావమును గల్పించెను. జ్ఞాన, సంస్కారములను స్వప్రయోజనార్థమై యనితర లభ్యముగ దాచి యుంచుకొనిన యగ్రవర్ణులును వారిచే నిందితులగు శూద్రులవలెనే యజ్ఞానులై యుండిరి. క్షత్రియులు ధైర్యశాలురే. కాని వారు స్వార్థ ధర్మము దప్ప యన్యధర్మము నెఱుగరు. స్వార్థపరత్వమును మాంద్యమును దేశమున పూర్ణీభవించియుండెను. అంధకారము దేశమున దృఢముగ పాదుకొనియెను.

సంఘీభావ శూన్యతయే హిందూధర్మముయొక్క దౌర్బల్యము. బ్రాహ్మణులు విద్వాంసులు. క్షత్రియులు శూరులు. వైశ్యులు కృషి పరాయణులు. శూద్రులు నమ్రులును సేవాసక్తులును. సామగ్రి శ్రేష్ఠమైనదే. కాని వాని నన్నింటిని బంధించుటకును—దృఢీకరించుటకును—ఏకాంగమువలె, ఏక జీవివలె భావించి ప్రవర్తించునటుల జేయుటకును దగిన సూత్ర మెద్దియును లేదు.

హిందూమత విశ్లేషణమునకు కారణము హిందువును గాఢముగ నాశ్రయించుకొని యుండిన కులభావము లేక వర్ణభావము నందే కల దని నా యనుమానము.

దేశ మిట్టి యవస్థలోనికి రా దొడంగిన పిదప మహమ్మదీయుల దండయాత్రలు తటస్థించెను. సరళమయ్యును తీక్ష్ణము కఠోరము నై సర్వాంగ సంపూర్ణ నిర్మాణము కల మహమ్మదీయ ధర్మము అచింత్యము తరళము నగు హిందూధర్మము కంటె నతిశయముగ ప్రబలుట విధాయకము. శౌర్యశాలురగు రసపుత్రయోధులు లక్షల కొలదిగ గలరు. కాని వారి యెల్లరి హృదయపూర్వక భక్తి నాకర్షించు ధార్మికాధికారి గాని లౌకికాధికారి గాని లేకుండెను. వారికి దేశమునెడల స్వధర్మ పరి

జ్ఞానము శూన్యము. జాతీయతా భావ మభావము. యోధుమను యోధుమను, కులమును కులమును పరస్పర వైషమ్యముల బూని నిరంతరమును పోరాడుకొనుచుండెను. ఎల్లరకును సమాన ప్రతిపక్షు డెత్తి వచ్చినప్పుడు తమ తమ కలహముల నవలద్రోచి ప్రతిఘటించి పోరుట వారెఱుంగరు. అటులకాదు ముసల్మానులు. వారారాధించిన దొక్క దైవమునే, వారు విశ్వసించున దొక్క ప్రవక్తనే, వారంగీకరించున దొక్క మతాచార్యునే, వారు సేవించున దొక్క నాయకునే. వారికి తమ నాయకుని వాక్యమే మర్ధ్యమగు శాసనము. స్వధర్మమును, మరణమును—ఈయుభయమును కీర్తిప్రదములే—స్వర్గసంపాదకములే—ఇదియే యిస్లాము ధర్మముయొక్క ముఖ్యమతము. దీనిని ముసల్మానులు పూర్ణమానసములతో ననుష్ఠింతురు. రసపుత్రు లెల్లరు నేకీభవించినచో ముసల్మానుల నణగిడనీయకయె యుందురు. కాని వారు స్వల్ప నిరోధము మాత్రమే కావించిరి. దేశమును విజాతీయాధికారము క్రింది దీసికొనివచ్చుట కొక్క యాపద మాత్రమే చాలును. రాజపుత్రు లోడినతోడనే దేశము గత్యంతరము లేమిచే నన్యథా యత్నము లేకయే లోబడెను. ఒక ప్రత్యేక కౌటుంబికుల ముండుట వలని దుష్ఫల మిదియే. మీ దేశ గృహ స్వాతంత్ర్యముల సంరక్షణార్థము మీలో ప్రతిపురుషుడును యోధుడు కావలయును. అట్టి జన సంఘముయొక్క పోరాటమున గాని పెక్కుపోరాటముల గాని యోటమి పొందవచ్చును. కాని హిందు దేశమునకు పట్టిన దుర్గతి వారి కెన్నడును దటస్థించదు. వా రెన్నడును దమ స్వాతంత్ర్యమును శాశ్వతముగా గోల్పోవరు.

ఆర్యావర్తము పరాజయమునొంది ముసల్మానుల పాదాక్రాంతమై యుండెను. కాని ఐగుప్త, పారశీకాదుల వలె నామె స్వధర్మపరిత్యాగ మొనర్చి మహమ్మదీయముగ విపాకము చెందలేదు. ఆమె యత్యంత విస్తీర్ణమైనది. నీ వొక ప్రవాహము నవరోధింప గలవు. కాని

గభీర సాగరోదకముల నెవ్వరు నిరోధింప గలుగుదురు ? సత్వరమే యీ యుదకములు విజేతల శిరశ్శోణితస్సులను ముంచివైచి వారిని దాదాపు లోబరచుకొనెను. ఇంతలో ఆంగ్లేయులీ రంగమున నావిర్భవించిరి.

దేవదూత యానశ్యకము:—

ఆశ్చర్యము. మహమ్మదీయులు సులభులుగ నుండిరి. శతృవులు సాధారణముగా జనుదెంచు నట్లే వారును నభోమండలమును భేదించు రణారావములతో నేతెంచిరి. వారు మన యాయుధములను బోలు నాయుధములతోడనే పోరాడిరి. వారి కెద్దియేని సంగ్రామ నీతి కలదేని యది మన కపరిచితము గాదు. యుద్ధ, వైషమ్యముల తాప ముపశమించిన తోడనే వారు మనలను సామాన్య జనులు పరస్పరము నాదరించుకొనునట్లులే యాదరించుచుండిరి. మనకు స్వాగత మొసంగుచుండిరి. స్వధర్మహాని భయమున హిందువుడే దూరదూరముగా దొలగుచుండెను.

ఇప్పుడు మన మొక యుచ్చతర జాతితో వ్యవహరింపవలసి వచ్చెను. చిరకాలముగ నాంగ్లేయులకు రాజ్య సంపాదనమునం దిచ్ఛ వొడమలేదు. కావున సద్యఃకలహము లేదు. భీకర సంగ్రామము లేదు. ఉత్తమాధికారమునకై కత్తులకు పోరాటము లేదు. ఎంతయు నగోచరముగనే సహజముగనే సకలమును పరివర్తిల్లుచుండెను. ఆంగ్లేయులు విశేషముగ బోరినది తమఖడ్గ సహాయమున గాదు. వారు తమ బుద్ధినైపుణ్యము వలనను ఔదార్యము వలననే హిందూదేశమును వశ మొనర్చుకొనిరి. వారు దేశము నరాజకమునుండి సంరక్షించుటకు తరుణముననే యరుదెంచిరి. కావున ప్రజలు వారిని రక్షకులుగ గ్రహించి కృతజ్ఞతతో నభినందించిరి.

బ్రిటిషు ప్రభుత్వముక్రింద దేశమున శాంతి నెలకొనియెను. ఆంగ్లేయులు న్యాయముగ పాలింపనెంచిరి. హైందవులు రక్షణమును

గోరిరి. కావున నీ యుభయుల యాశయములందును విరోధము కలుగ లేదు. సామ్రాజ్య నిమిత్తమగు స్పర్ధయుండుటకు మొదలే యవకాశ మొదవలేదు. స్వయంరక్షణ మొనర్చుకొనలేని వారికి సామ్రాజ్యవిచార ముండ బోదుకదా !

దేశీయ వ్యవహారము లాంగ్లేయుల చేతులలోనికి తరలినతోడనే వ్యవ స్థాభివృద్ధులతో గూడిన నూతన శక మారంభమాయెను. నూతన పాలనము సత్యమును న్యాయమును సార్వ్యగాను ప్రధాన లక్షణములుగ గలిగియుండెను. ప్రభుత్వ మిప్పుడు దుర్బలముగ క్రూరముగ నిరంకుశ ముగ అసంబద్ధముగ నుండుటలేదు. నేడు స్థిరత్వమును క్రమమును రక్ష ణమును కుదిరెను. ప్రభుత్వ సేవకులు మున్నెన్నడును జూపి యుండని స్వధర్మ భావమును గనుపరచిరి.

కాని గొప్ప కొలదు లెంచక బ్రాహ్మణులకును పంచములకును విద్య యొసగుటయే ఆంగ్లేయులు మన కొనర్చిన మహోపకారము. అది యొక్కటియే నేడు మనము కాంచునట్టియు, భావికాలమున గాంచ నా శించునట్టియు నఖిలమును బ్రవర్తింప జేసి యున్నది.

విద్య దేశమునకు వెన్నెముక యగు నడుమతరగతులలో విస్తర ముగ వ్యాపించెను. వారి కన్నులు తెరచెను. వారి మెదడులను పదు నిడెను. వారి హృదయములను కలంచెను. వితర్కము తనప్రభావమును జూపసాగెను. ఇంతపర్యంతమును తూష్ణీంభావమున బోనిచ్చిన సకల సాదృశ్యములును వ్యతిరేకములును నేడు తమకుదామే మనదృష్టి యెదు టనిలిచి సమాధానమును ప్రశ్నించుచున్నవి. వితంతువును సజీవముగనే యేల దహింపవలెను? అపత్నీకుడేల హాయిగా మరలబెండ్లియాడవలెను? నీచప్రతిమయం దేల ఈశ్వరు నారాధింపవలెను ? భావమునం దేల యారాధింపరాదు ? బాలకు లేలవిద్య నేర్వవలెను ? బాలిక లేలనేర్వ రాదు ? ఇవియు నింక ననేకములును అసంబద్ధప్రశ్నము లుత్పన్నము

లమ్యెను. నిజముగా కాలముమారెను. హిందూదేశము నూతన చక్రము నధిష్ఠించెను. వాతావరణము సంక్షుభిత మగుచుండెను. సాంఘికవిప్లవము సన్నిహితముగనుండెను. అయ్యది ప్రాక్ప్రతీచీ ఖడ్గములు హిందూదేశమున సంఘర్షణమొంది తళ త్తళ మెరయుచు ఖంగు ఖంగున మొరయుట మాత్రమే కాదు——ఇది సాక్షేపముగా స్వల్పవిష యము——ప్రాచీనాధునిక సభ్యత లసంయోగమును, విజ్ఞానావలంబిత మును ప్రబలమును నగు దేహాత్మవాదముయొక్కయు శంకనీయములగు నాచారముల ప్రపుగలిగిన జీర్ణమగు నధ్యాత్మవాదముయొక్కయు సమ్మేళనమును మాత్రమే యత్యంత ఫలప్రదమగు విషయము. ఈ సంఘర్షణముయొక్క ఫలిత మేమగునో వితర్కించుట మన కర్తవ్యము కాదు. ఈ స్థితిలో ననేక హిందూయువకుల మనోభావములను రూపించుటయందు ప్రధానపాత్రము వహించినయొక మహానుభావుని జీవితోపదేశములు మాత్రమే మన ప్రస్తుతవిషయము.

ఈశ్వరదూత యాగమనము:——

కొన్ని యవసరములయందు ప్రజాసంఘ మొక నవీన సువార్తయు నూతన సంరక్షకుడును లేక నిలువజాలదు. నూత్న యోచనలును నవభావములును నవీనాభిలాషలును విజృంభమాణముగ ప్రవహించుచున్నప్పుడు సనాత నాధునాతనములను సమన్వయముచేసి సమీకరణ మొనర్చుటకును ప్రవృద్ధిముఖమగు నవజీవనపథమున మనలనునడుపుటకును మన కొక దేవదూత యత్యంతావశ్యక మగును.

మన మెల్లరమును దయానందుని గూర్చి విని యున్నారము. ఆయన నామమునకు విశేషవ్యాప్తి కలదు. కాని దాని యుచ్చారణ మెన్వని హృదయముననను——కడకు మన మానసములందును ప్రేమ, శాంతి, ఐక్యభావములను పుట్టించుటలేదు. ఆయన నామము తన దేశీయులలో ననేకులచే వివాద, కలహ, విపరీతభావములకు పర్యాయ

పదముగ భావింపబడుచున్నది. వారు ఆయన స్వమతము వినా సర్వమతములను విగర్హించువాడనియు, అన్యజనపక్షపాతములను కఠినముగ ఖండించువాడనియు, ఇతరుల యతిశయ ప్రేమాస్పదములగు విశ్వాసములను పిచ్ఛేదించి విభంగించుట తప్ప నన్య సమర్థతా శూన్యుడనియు మాత్ర మెఱుంగుదురు.

కాని యది సంపూర్ణముగను యథార్థముగను ఆయనను చిత్రించుటలేదు. దోషము లాయనలో నిశ్చయముగ గలవు. కాని యాయన నెరవేర్పవలసిన కార్య మెంతయు నప్రియమైనది—ఆయన యొక్క మూఢ జనాంగముయొక్క ప్రేమాస్పదములు గౌరవాస్పదములు నగు గాఢాభిప్రాయములను నిర్మూలింపవలసి యుండెను.

ఎవ్వరి మానసములను నొవ్వకుండునట్లు తన జీవితోద్దేశమును నిర్వహింప జాలు నాతడు ఉత్తమ పురుషుడని యెల్లరు నంగీకరింతురు. కాని ప్రేమ నమ్రతా స్వరూపుడగు యేసుక్రీస్తును, జ్ఞానమూర్తియగు సాక్రిటీసును, ప్రజాక్రోశవిషయ మగు నప్రియ మొనర్చి వారి యనూనాహంకారమునకు గుఱికాక తప్పినది కాదేనచో, దయానందునిపై నారోపింపబడిన వాక్కాఠిన్యదోషమును క్షమార్హము కావచ్చును. ఎవరు దూషించినను ఎవరుభూషించినను ఆయన చేయవలసిన కార్యము సంపూర్ణముగ నొనసాగవలసియుండెను. ఆయన సత్యము నుపదేశించుట కవతరించెను. ఆధర్మమును లెస్సగా నెరవేర్చెను. ఎవ్వరికేని అవనతశిరస్కులు కావలసినచో నట్టివారినే యన్వేషించునది. వారు కోరినంతనే లభ్యమగుదురు. ప్రపంచమున నిరంతరము నట్టివారే లెక్కకు మిక్కిలిగ నుందురు.

మానవ స్వభావమునందలి మహావిచిత్రములలో మన లోపములను మనము గుర్తెఱుగజాలకుండుట యొక్కటి. భక్తిపరుడగు హిందువుడు తన నమ్రప్రవర్తనమును, అనుకూల స్వభావమును, ఉపకారశీల

మును, స్వపరదోష సహనమును, కర్మవిశ్వాసమును, కీడు తనంతనే పోషిమించెందు నను దృఢవిశ్వాసమును, ఎవ్వనికిని పరుల వ్యవహారము లతో, ప్రసక్తి కూడ దను స్థిరాభిప్రాయమును జూచుకొని గర్వించు చుండును. అతడు విజాతీయ లీగుణములనే దాస్యము, ఆశ, ద్రోహము, మాంద్యము, పిరికితనము నను కేవల విరుద్ధనామములతో బిలుచునని యెఱుగను. మెకాలే పక్షపాతుడై యుండవచ్చును. అతని వ్రాత యతిశయోక్తి కావచ్చును. కాని యిట్టి బిరుదము లొసంగిన దాత డొక్కడే కాదు. ఐరోపీయ దృష్టితో పరికించితిమేని దయానందుని ప్రవర్తనము మాననీయముగ గన్పట్టును. ఆయన యుగ్రనైతిక వర్తనము, ప్రవర్తనా పారిశుద్ధ్యము, ఉత్తమాదర్శము, స్వకార్యమునందు పూర్ణవిశ్వాసము. నిష్కాపట్యము, నిర్భీతి, దీక్ష, ఉత్సాహము, స్వదేశ స్వజనులయందు నిస్స్వార్థభక్తి—ఈలక్షణములు ప్రాయికముగ హిందూ దేశమున దప్ప! మఱి యెందైనను ప్రశంసనీయములే యగును.

మహాపురుషుల జీవితములు మన కేమని బోధించు నెడల నయ్యది యాత్మవిశ్వాసమే. ఈ లక్షణము విశేషముగా పొడకట్టని మహాపురుషు డెందును గానరాడు. మన దేశముయొక్కయు, పురాతన గ్రీసు రోముల యొక్కయు, ఆధునిక యూరోపుయొక్కయు రాజశ్రేణిని తత్త్వవేత్తలను బరీక్షించితిమేని విజయశాలి యగువాడు పురుషుడే యని నిశ్చయముగ గనుగొందుము. ఆవంశ యపాయము స్ఫురించునంతనే తన తలను లోనికి ముడుచుకొను పిరికిపురుగు గాదు జయించునది. భయమన్న నేమియో యెఱుంగని యొక భీష్ముని హృదయమును, నిరోధమునుండి బలము నాకర్షించి కడకేమైనను అసత్యమును వంచనమును ధైర్యముతో ధిక్కరించి యెదుర్కొనగల యొక ల్యూథరు నిర్వక్రశౌర్యమును మాత్రమే విజయ మకుటము ధరింప గలవు.

దయానందుడు నలుబది వత్సరముల ప్రాయమున జీవితరంగమున ప్రవేశించెను. కావున పరిపక్వాభిప్రాయములను సుస్థిరోద్దేశములను మన కొసంగగల్గెను. ఒక వ్యక్తి కాని జాతి కాని దృఢశిక్షణము లేక యభివృద్ధిగాంచుట యసంభవ మని యాయన నిశ్చితాభిప్రాయము. శిక్షయనగా నేటి పాక్షిక విద్య కాదు. అయ్యది విశాల భావోద్దీపిత మగు విద్య—ఇంద్రియ శిక్షణము-క్రియాశక్తి ప్రవృద్ధి-ప్రతిభా ప్రకాశము-బ్రహ్మచర్యానుష్ఠానము- అవిరామము నిగ్రహము-మనశ్శక్తివికాసము. ఆయన విద్యకై, జ్ఞానమునకై, సత్యమునకై యూరోపునకైనను అమెరికాకైనను దక్షిణధ్రువమునకైనను పరతెంచును. ఆయన సత్యగ్రహణము కొఱకును జ్ఞానలాభముకొఱకును ఎట్టి సంకటములనైన లెక్కగొనడు. ఆయన పాఠశాలలను స్థాపింప నారంభించెను. ఆయన యుపక్రమింపనెంచిన విద్యాపద్ధతి తన జీవితకాలమున నెరవేరక పోయినను నిర్యాణకాలము వరకు దానియం దాయనకు సంపూర్ణవిశ్వాసముండెను. స్త్రీ పురుష శిశుభేదములేక సర్వజనులకును తప్పక యుచితముగ నిర్బంధముగ విద్య గఱపుడని నిరంతరమును ఘోషించుచుండెను. ఆయన మరణానంతరమునని కానిందు-మరణానంతర మనుటకంటె దేహవిముక్తి యనుట సమంజసము; ఆ మహానుభావుని యాత్మ నేడును మన నడుమ సజీవముగనే యాచరించుచున్నది—ఆమహాత్ముడు నెలకొల్పనెంచిన శిక్షాక్రమ మనుష్ఠాన రూపమును బొందెను. నేడు హరిద్వారము మున్నగు నెలవుల యథార్థజాతీయ విద్యాలయములై విలసిల్లు గురుకులము లాయన శిక్షావిధానముయొక్క స్వరూపములే. ఆయన యున్నతవిద్య నగత్యముగ నెంచెనే కాని విలాసార్థముగ దలంప లేదు. బ్రహ్మచర్యమును, ఆత్మనియంత్రణమును, భౌతిక మానసిక ఆధ్యాత్మిక జీవనాభివృద్ధులకు మూలాధారముగ నెంచెను.

ఆయన యసమానమై దుష్యమును, వచఃపరివాహమును, చమత్కారమును, సమయస్ఫూర్తియు తన విపక్షులతోడి వితర్కములలో నాయనకు విజయము చేకూర్చుచుండెను. ఆయన యసదృశుడై ప్రకాశించెను. శంకరాచార్యుని యనంతరము వక్తృత్వమందును వైదికధర్మాలంబనమందును భారతవర్షానురక్తియందును ఇతోధికుడు లేడనుట యతిశయోక్తి కాజాలదు. శంకరాచార్యునివలెనే యాయన యన్య మతనాయకులతో జర్చించి ప్రతిపక్షులు కాకున్నమానె-మున్ముందు దెలియునట్లు—జనసామాన్యమేని యంగీకరించునటుల, హిందువు దన్యమతావలంబులగు దన సోదరుల జూచి తలంచుకొన నక్కఱలేదనియు, ప్రపంచమునందలి యే యితరమతస్థునితోనైన ప్రతిఘటించి స్వమతము స్థాపించుకొనగల్గుననియు, తనమతమే హేతుపరీక్షను అనుభవజ్ఞాన పరీక్షను నిలువగలుగుననియు, నిర్ధారణ చేసెను. పలుమాటలేల? ఆయన మన దుర్గముల బలమును మన యాయుధముల యుత్కృష్టతను మనకు జూపెను. ఇంకనేమనిన మనయజ్ఞానమును గుర్తించనమును జూచి యదను గైకొని యింతదనుక మనకు విరోధముగ బనిసేయుచు విజయులగుచున్న మన శత్రువుల కవచములయందలి దుర్బలస్థానములను మనకు వెలిపరచెను. దాని ఫలితము మన కెల్లరకును విదితమే. హిందూమతముయొక్క ధర్మాపభ్రంశక ప్రవృత్తి యదృశ్యమయ్యెను. విశ్లేషణము వినాశమొందెను. సంఘము స్వశక్తి విశ్వాసమును క్రిమ్మరగాంచెను. శక్త్యుత్సాహములు మరల సరుదెంచెను. ఆయన మన యాత్మ విశ్వాసముయొక్క పునర్లాభముతోడను, నష్టప్రదేశముయొక్క పునర్గ్రహణముతోడను సంతృప్తి బడయలేదు. ఆయన యింకను తమోనిబిడములగు భూభాగములకు ప్రకాశమును గొని పోవుట మన విధాయక ధర్మమని యుద్ఘోషించెను:—ఓహో! ఏమి సాహసము! అంతటి మిఱుమిట్లు గొల్పు నాగరికత గల యూరోపు అమెరికాఖండము లిం

లింకను అంధకార బంధుమలట! అత్యంత దుర్బలులయ్యును హైంద
వులువిజయగాములగుటకు సమర్థులట!

ఆయనకు గల యాత్మప్రత్యయమును వైదికధర్మవిశ్వాసమును
మహోత్కృష్టమైనవి. ఆయన తన విజయమును గూర్చియు, తాను
బోధించు ధర్మవిజయమును గూర్చియు నెన్నడును శంకవహింపలేదు.
ఆయన సమగ్రభారతవర్షమును స్వమత పక్షమునకు ద్రిప్పుకొన గల్గుదు
ననియు, తన యనుచరులేనాటికైన విశ్వప్రపంచమునందును విశేష
వ్యాప్తి చెందుదురనియు, గాఢముగ విశ్వసించెను. కొందఱాయన విభ్రాం
తుడనియు, సంకనేమోయనియు ననవచ్చును. కాని స్వీయ జీవితోద్దేశము
నందు విశ్వాస శూన్యుడు దాంభికుడు. మహాపురుషులట్టి నైజముతో
నిర్మింపబడలేదు. వారు ప్రతిఘటించి నిలుచు పరీక్షలు క్షీరనీరములవంటి
విశ్వాసము గలవారికి దుస్సహము లగును.

దయానందునిపై నసహనదోష మారోపింపబడెను. ఆయన సర్వ
మతములను విమర్శించెను. స్వమతమును దప్ప యేమతమును ప్రశంసింప
లేదు. ఇంతియకాదు. తన ప్రతిపక్షుల యెడ నిందావాక్యములనే ప్రయో
గించుచుండెను. ఇదియే ఆయన యందలి గొప్పలోపము. ఆయన దుర్వి
షయములను దప్ప యన్యమును దుర్భాషలాడి యుండెనని నేను విశ్వ
సింప జాలను. విశ్వసింపను. ఆయన దిట్టముగానే కొట్టుచుండెను. కాని
యాహాతి యసూయతచే గాక యొక చెడుగు మూలముననో యపరాధ
కారణముననో ప్రయుక్తమగుచుండెను. మహమ్మదు గాని బుద్ధుడుగాని
శంకరుడు గాని క్షమాశీలురై యుండెనా? చెడుగును సహించుట
శ్రేష్ఠమేయగునా? దానియున్మూలమునకు నకయి తనకనిష్టికనయిన గదుప
నిచ్చగింపని వారికి నాతి మది శ్రేష్ఠమగును కాని ధర్మము నిమి
త్తము తమప్రాణముల నర్పింప సంసిద్ధులగు వారికయ్యది కేవలము
భిన్నవిషయము. మనము సహనము సహనమనునది బహుళతరముగ

నుదాసీనతయు, సంశయాత్మతయు, పిరికితనమును, క్లేశభయముననో చిత్తరాహిత్యముననో యగు శాంతియు మాత్రమే యగును. దయానందుని సమాధానపర్చుట మెఱుగను. ఆయన యొకప్పుడును దోషాచ్ఛాదన మొనర్పలేదు శంకించుదానిని మఱుగుసేయలేదు. ద్వేషించుదానిని దాచియుంచలేదు. ఆయనహృదయము నిర్వ్యాజమును బహిరంగమునునయి కొందరనునట్లు కుంఠితమయి యుండెను. నీవు దిద్దుకొనవచ్చుననునుద్దేశముతో ఆయననీదోషముల నీముఖమునుదుటనే వెల్లడిచేయును. ఆయనకు కపటము లేదు. పగలేదు. అసూయతలేదు. ఆయన హృదయము నిష్కల్మషమును శ్రేష్ఠము నయియుండెను. ఆయనమూలోద్దేశములనిమిత్తమును, తద్వ్యతిరేకముగను బోరాడెను. ఆయనకువేరుగ నే మానిసియందును ద్వేషములేదు. ఆయన రెవరెండు స్కాటును, సర్ సయ్యదును ప్రేమించుచు గారవించుచుండెను. వారు పరస్పరము మిగుల సద్భావములతో నుండిరనుట యసత్యము కాజాలదు. ఆయన జయినులతోడను కర్నలు ఆల్కాటుతోడను జరిగిన వివాదములలో గూడనక్రమముగను సక్రోధముగను ప్రవర్తించియుండలేదు. ఆయన సత్యము నత్యంతము ప్రేమించెను. ఎట్టి యిక్కట్టులు ముట్టడించినను సత్యము ననుసరించి తీరును. ఆయన పరులను సరకుసేయనిచో తన్నును సమముగనేయెన్నడును సరకుచేయలేదు. జీవితకాలమంతయు నెట్టిభౌతిక కష్టములను నెట్టుకొనునో, ఎట్టినైతిక నియమములను దన మీఁదవిధించుకొనునో పాఠకులు ముందుముందుజూడగలరు. ఆయనవిమర్శనములు న్యాయములు, ఆయన రంధ్రాన్వేషములు విద్యావ్యాప్తికి గాని పరపీడనమునకును పరహానికిని గావు. నీవు దుష్టవర్తనుడవయి యుండజూచుచు మిన్నకుండుటకంటె నిన్నుండనీక నొంచుటయే మేలని యాయన విశ్వసించెను. తానొప్పుగా తలంచునది తప్పును, తప్పుగా నెంచునది యొప్పును నగునేమోయని యాయన కెన్నడును స్ఫురింపలేదు. మహాత్ములమానసము సంకోచ

మెరుగడు. ఎవనికి తప్పొప్పుల విభేదము లేదో, మంచిచెడ్డలు సమానము లో అట్టిమానవుడు మానవుడు కాడని నానిశ్చితాభిప్రాయము. ఆతడు దేవుడో దయ్యమో కావలెను

స్వార్థాన్వేషణము ప్రబలముగనున్న కాలమున తన జీవితమును స్వజన స్వదేశ సేవనమందు వినియోగించు పురుషుని గాంచగల్గు టెంత యు సంతోషావహముగ నుండును. దేవుని తరువాత దేశమే యాయన ప్రేమాస్పదము. ఆయన రచనల యందలి ప్రతి పత్రము నిందులకు సాక్ష్యమిచ్చును. ఈ కారణము వలననే బహుజను లాయన జగదాచా ర్యుడనుటకంటె స్వదేశ భక్తుడనుట భావ్యమందురు. అందుచేతనే కొంద ఱాయన యాదర్శములు ధార్మికములుగ కంటె నెక్కుడుగ రాజకీయము లనియు జెప్పుదురు. కాని దయానందుని శ్రద్ధగా పఠించిన వానికిని, నిష్పక్షపాత హృదయముతో విషయ విచారణకు బూనుకొన్న వానికిని న్యాయనిర్ణయము చేయుటలో కష్టము లేదు. ఆయన మిగుల ధైర్యశా లియు న్యాయశీలియు నిర్వ్యాజ హృదయుడును నగుటచే ధార్మిక సాం ఘిక సంస్కర్త వేషమున రాజకీయ ప్రచారకుడుగ నుండజాలడు. ఆయన తన దేశముయొక్క రాజకీయ పునరభ్యుదయమును గోరెనేని తన యుద్దే శముల నెంతయు బహిరంగముగనే ప్రకటించియుండును. భూతలమున నెద్దియు నాయన యుద్యమము నవరోధింప జాలదు. ఆయన నిర్భయుడు. తన స్వధర్మము నెంతటి కష్టమునకైన నోర్చి దీక్షతో నిర్వహించును. ఆయన జీవిత చరిత్ర మంతయు నాయన ప్రచ్ఛన్న రాజ్యాంగ సంస్కర్త యను నూహ నబద్ధముచేయుచున్నది! ఆయన ధార్మికోపదేశములును సాంఘిక సంస్కారములును ప్రజల నేత్రములను దెరచి వారిలో రాజకీ యాభ్యుదయమునకై కాంక్షను ప్రజ్వలింపజేయ వచ్చును. అది కేవలము భిన్న విషయము. అట్లయి నచో బ్రిటీషు ప్రభుత్వమును ఈ నేరమునకు గుఱి కావలసి వచ్చును. ఏలయన ప్రజానేత్రములను విప్పుటలో బ్రిటిషు

దొరతనమువలె నెయ్యదియు సహాయపడి యుండలేదు. మఱియు ననేక సంపుటములుగనున్న యాయన వ్రాతలలో బ్రిటిషుపాలనమునెడ విద్వేష చిహ్నముకాని, బ్రిటిషు ప్రభుత్వము దుష్టము కావున దానిని నిర్మూలింపవలెనని యుపదేశించు నట్టు లొక్క యక్షరము కాని కానరాదు. అంతటి మేధాసంపన్నుడును లోకజ్ఞానియు బ్రిటిషు ప్రభుత్వము మన కొనర్చిన యుపకారములపట్ల కను దొరగి యుండజాలడు. శాంతముగ దేశమభివృద్ధి గాంచుటకు బ్రిటిషు సంరక్షణ మావశ్యకమని యాయన గ్రహింపకుండ జాలడు. కాని యట్టి మెలకువయు, గ్రహణమును భారతవర్షముయొక్క హీనస్థితికై విషాదమునొంది హిందూదేశము మరల నొకమారు ఉన్నతపదవి నధిష్ఠించునను నాశను వెలిబుచ్చకుండగను, తన మాతృదేశాభ్యుదయమునకై ప్రయత్నము చేయకుండను నాటంక పరుప జాలవు.

హిందూదేశ మాయాశను నెరవేర్చుటకును ఆప్రయత్నములు కొనసాగించుటకును పూర్వము పెక్కుమంది దయానందు లావశ్యక మనుట విస్పష్టము. మన మెల్లరమును హిందూదేశము ఇంగ్లాండు, అమెరికాలవలె నౌన్నత్యము నొందవలెనని యభిలషింతుము. కాని యెంతటి యాలోచనముతో, ఎట్టి పరిశ్రమతో, ఎందఱు మనుష్యులతో, ఎంత ధనముతో నా యౌన్నత్యము క్రీతమయ్యెనో విచారింప నెంచము. ఔన్నత్యమునకు రాజమార్గము లేదు. నీవు నీదేశాభివృద్ధికి మిక్కిలి ప్రియముగ వెలపోయవలెను. నీ హృదయ శోణితమును ప్రవహింపజేయవలెను. నీ వందులకు సంసిద్ధుడవై యుండవేని నీ దేశమును గూర్చియు దేశసేవను గూర్చియు దలంపకుండుట యుత్తమము. మఱియు యథార్థ మేమన్న ధీరహృదయము లేనివో నీవు నీకే యెట్టి యుపకారమును గావించుకొనజాలవు. నీవు పురుషుడవై యుండవలెనన్న పౌరుషోపేత మగు హృదయము గలిగియుండవలెను. అదియే ప్రథమా

వశ్యకము. నీవు భీతహృదయుడవు నిరాశాచేతస్కుడవు నైనచో నీకొఱకు గాని నీ దేశముకొఱకుగాని యే మహత్కార్యమును నిర్వహింపజాలవు. జీవించుటకుగాను నీవు చావవలెను అని కొందఱందురు. అట్లైతే నీ దేశము జీవింపవలెనన్న, మానవజాతి జీవింపవలెనన్న నీవు చావవలయు ననుట కూడ సత్యము గాదా? ఎట్లైనను నీవు చావవలయును. చావు వలననే బ్రతుకు కలదు. కాని క్షమాశూన్యత పనికిరాదు. అభ్యుదయ మార్గ మెప్పుడును దీర్ఘముగనుండి శైలోపరికి బోవును. కష్టము వచ్చి నప్పుడు చలింపకుము. ధైర్యముగోల్పోవకుము. సంక్షోభమునొందకుము. స్వపక్షయోగ్యతయందు విశ్వాసముంచుము. పనిచేయుము. పనిచేయుము. గమ్యస్థానమును జేరుటకిక నుపాయాంతరము లేదు. అసిద్ధిని, పరాజయ మును, ప్రతికూలమును నెదుర్కొని యెట్లు లోపికతో పరిశ్రమ చేయ వలయునో దయానందుడు మనకు బోధించుచున్నాడు. ఆయన యుత్సా కుడగు విభ్రాంతుడు కాడు. చక్కని వ్యవహారజ్ఞుడు. ఆయన నిశ్చ యము లేక యే కార్యమునకు గడగి తొట్రుపడడు. అదృష్టముపై భారము వేయడు. స్వశక్తిపై, స్వనిర్ణయముపై ఆధారపడియుండి పరులుకూడ నట్లు చేయగోరును. ఆయన వక్రమార్గములను కపటవ్యవ హారములను మిక్కిలిగ ద్వేషించును. ఆయన న్యాయవంతుడు. ఛల రహితుడు. పరిశుద్ధుడు. ఈగుణములయందే యాయన బలము కలదు. ఆయన యెన్నడును తన యాశయములను దృఢ విశ్వాసములను ఆదర్శము లను రహస్యముగ నుంచలేదు. ఆయన విషయమై యెట్టి రహస్యమును లేదు. కీర్తిశేషుడగు పండిత లేఖరామ మహాశయు డాయన దైనిక జీవితముయొక్క ప్రత్యంశమును సేకరించి యుంచెను. ఆయన యెట్లు లగపడెనో కాదు ఎట్లుండెనో మీరెఱుగగలరు. ఎప్పుడును తన పార్శ్వానుచరునకు మహాపురుషుడు కాజాలడను వాక్య మాయన కన్వ

యింపదు. ఆయన యౌన్నత్య మాతన దైనిక జీవనమునందే ప్రస్ఫుట ముగ గానవచ్చును. కాని యుపన్యాస వేదికల మీదను వార్తాపత్రికల యందును గాదు.

తన దేశముయొక్కయు మానవకోటి యొక్క యు సంసేవనము నందే జన్మము ధన్యమొనర్చు మాన్యుని నిస్స్వార్థతను గూర్చి ప్రసంగించుట యనావశ్యకము. అతడు స్వార్థరహితుడు కాక యన్యథా కాజాలడు పరోపకారశూన్యులు స్వార్థపరులు నగు మహా పురుషులుండవచ్చును. కాని వారు తమ దేశముయొక్కయు మానవజాతియొక్కయు సేవకులు కాజాలరు. వారి యున్నతి యన్యవిధముల నెగడవచ్చును. దయానందుడు స్వార్థభావ మసలే యెరుగడు. ఇంకను బాలప్రాయముననే-లావణ్యశోభిత యగు వధూప్రలోభము కన్నుల కట్టెదుట దేదీప్యమానముగ బ్రకాశించుచుండగానే ఆయన శరీర సౌఖ్యములను పరిత్యజించి గృహమును విడిచెను. ఆయన యోగమును శాశ్వత బ్రహ్మానంద భాగ్యమును పరివర్జించెను. ఎందుకొఱకు? పరులకొఱకు. స్వీయజీవితో ద్దేశముకొఱకు. ఆయన పెద్దతనమునందును ప్రలోభనములకు కొఱతలేకుండెను. ఆయన నానామతముల తీవ్రఖండనమును విరమించునెడల మహంతు పదవిని విశేషద్రవ్యమును నొసంగుదుమనిరి. ఆయన యీత్యాగముల నుచిత ద్వేషముతో దిరస్కరించుటయే కాక యిట్టి కార్యమును దలపెట్టినవారిని వారిపాట్లకె చీవాట్లు పెట్టెను. ఈకార్యమునకు జనకులు సామాన్యులను కొందురేమో? కాదు. వారెల్లరును రాజులును మహారాజులును, కాని ఆయనకు మనకువలె నిట్టి భ్రాంతులులేవు. ఆయన కేవలైశ్వర్య బిరుదములకంటె నన్యాధిక్యవిహీనుని, తిరిప మెత్తుకొనుచు దిరుగు నీచమానవుని నొక్కదృష్టితో జూచును. ఆయన పదవీ, భాగ్యముల ననుసరించి మనుజుల తారతమ్యనిర్ణయము సేయడు. ప్రజ్ఞా శీలములు మాత్రమే గౌరవమానముగ నెంచును.

దయానందుడు వితండవాదియు సూక్ష్మభేద దర్శియు గాడు. కుశాగ్రబుద్ధి సంపన్నుడయ్యు దనలోకజ్ఞాన పాటవముచే నర్థహీనములగు సూక్ష్మాంశముల జోలికి బోకుండెను. ప్రతిమారాధనము దూష్యమనియు బాల్యవివాహములు నిర్బంధమై ధవ్యము కఠినవర్ణభేదము మున్నగు నాచారము లొనర్చు ననర్థము లనుపేక్షణీయములనియు నాయన గ్రహించెను. తోడనే వాని సమూల విచ్ఛేదనమునకు బూనుకొనెను. ఈయాచారముల పక్షమున నెన్ని సూక్ష్మహేతువులను విశదీకరించినను ఆయన భావ మించుకయైన సంచలింపలేదు. కీడులో మేలు గనుచు దాని నోపికతో సహించు హైందవహృదయముకాదాయనది. "నన్ను ముట్టుకోకు నామాలకాకి" యను పద్ధతి విజ్ఞానాధారము కలదనియు, ఆధ్యాత్మికాభివృద్ధి కావశ్యకమనియు నెవ్వరు నాయన నంగీకరింప జేయజాలరు. స్వేచ్ఛావర్తక శోదనము జయప్రదమైనది, కావున శాంతిపుటిధోవతికంటె లాంకషైరు ధోవతి గ్రహణీయమని యాయన నెవ్వరును సమ్మతిపరుపజాలరు. కించిత్ శోభావ్రత మగునంతనే కీడును మనము సహింతుము. లేదా దాని కనుగుణముగ వర్తింతుము. ఇదియే మన విశేషాతిశయ లోపము. భ్రమా వివశుడవు గాకుమని దయానందుడు ప్రబోధించుచున్నాడు. పరిణతాభిప్రాయములు నీయందు శూన్యములగు నెడలను, పరవాద, పరానుభవములు నీపక్షాశయములకు విరుద్ధములగు నెడలను వాని చేతజిక్కి లోగి పోనకుము. మెలకువతో వర్తింపుము.

ఈ యాచార్యుని దృష్టి నాకర్షింపని విషయము లేదు. ఆయన భావమున నేదియు నత్యున్నతమును నతి నీచమును గాకుండెను. ఆయన గొప్ప కొలను లెంచక నీ యఖిల లోపములను నివారింప జూచును. నీకు పరమేశ్వరుని మహిమాధిక్యమును ఆయన సేవా విధానమును బోధించును. నీ వెయ్యది భుజింపవలయునో, ఎయ్యది త్యజింపవలెనో, నీ వెట్లధ్యయనము చేయవలెనో, ఎప్పుడు పరిణయమాడవలెనో, నీవెటుల

మాతృదేశమును సేవింపవలెనో, నీ సంతానము నెట్లు పెంప వలెనో, నీ సోదరీజనము నెట్లు లాదరింపవలెనో ఆయన బోధించు చున్నాడు. ఆయన నీజననమాదిగ మరణపర్యంతమును సార్వకాలిక విహితుడు. ఆయన యాధ్యాత్మికాచార్యుడు కానేరడని కొందఱు మానసీయులందు అనియు నే నెఱుంగుదును. వారందరు కదా "ఆయన యతిమానుష కృత్యము లేవియు సలుపలేదనుటయె కాక ఆయన యుద్యమముల లౌకిక స్వభావముకూడ ప్రాపంచిక విషయములచే నాయన యెట్లు కట్టువడెనో విశదీకరించుచున్నది. సంయమికి వి గ్రహార్చనా వితంతూద్వాహముల జోలియేల?" యథార్థ మత పరిజ్ఞానవిహీనులతో జర్చకు బూనుకొన్నచో వృథా కాలవ్యయమగును. ఉన్మత్తుల ముంగటను, నిక్కమో కపటమో ఈశ్వర సాక్షాత్కృతుల మని చెప్పుకొనువారి పాదముల యందును దండప్రణామము లాచరించునట్టియు, గ్రాహ్యమునకంటె దుర్గ్రాహ్యమే యధికముగ మనమున కంటు నట్టియు మనుజు లనవరతము నుందురు. వారికి నే జెప్పు న దేమన: దయచేసి వేరొక చోటికి కఱుగుడు, మీఱు విశేషముగ వెదుక నక్కరలేదు. జాగరూకుడును, ఉత్సాహపూరితుడును, భ్రాంతిశూన్యుడు నగుచు, బహుపత్నుడును, దృఢచిత్తుడు నయ్యును స్వచ్ఛహృదయుడును సరళస్వభావుడునై, తన పవిత్రతచే, అనురాగముచే, సేవనముచే సామాన్యజనులు దుర్భర నరకముగ నొనర్చుకొను లోకమును స్వర్గముగ మార్పజాలు సాధువిక మానవ దూతయై దయానందుడు వెలయుచున్నాడు.

ఆయన తన ధర్మమును వేదములపై నాధారపరచినను దానిని విశ్వజనీన ధర్మముగ నొనర్చుటకు శక్తి కొలదిని ప్రయత్నించెను. ఆయన భావమున వేదమొక గ్రంథముకాదు. వేదమనగా జ్ఞానము అది యార్యావర్తమున గానీ, చీనాదేశమున గానీ, యెచ్చట లభ్యమైనను సరియే. వేదము లీశ్వరదత్తము లనుట కర్థము సృష్ట్యాదిని మానవున కీశ్వరుడు

జ్ఞానము నను గ్రహించె నని యాయన మతము. మనుజుడు ప్రప్రథమమున మత్స్యరూపముగను, పిదప నశ్వముగను, పిమ్మట వానరముగను, అనంతరము మానవరూపముగను నవతరించెనని యాయన విశ్వసించలేదు. జ్ఞానము మనలో నుత్పన్నము కాలేదనియు, అది యీశ్వర ప్రసాదితమనియు దాని యార్జనమున కేక సాధనము ముఖాముఖిని వ్యాపింపజేయుట యనియు నాయన విశ్వసించెను. జాతి పరిణామవాద స్థాపకుడగు డార్వినుతో సమముగ నెన్నిక గాంచిన డాక్టరు వాలేసు సహితమిట్లంగీకరింపవలసి వచ్చెను:—నేను మానవాభివృద్ధియొక్క స్థితినిగూర్చి చింతించుచుంటిని. 7000 సంవత్సరములకు పూర్వము ఐగుప్త (ఈజిప్టు) దేశమునందలి విస్మయజనకములగు నవీనావిష్కారణములు * 1 మొదలుగ నేటివరకును ప్రపంచచరిత్రమునంతను బరిశీలించితిని. మఱియు ఆదిమలగు ఐగుప్త సిరియాదేశీయులనాటనుండి నవీనడ్రెడ్‌నాటు నిర్మాణము వరకును బుద్ధియందుగాని నీతియందుగాని వృద్ధి కలుగలేదనెడు నిశ్చయమునకువచ్చియుంటిని. పిరమిడ్ * 2 నిర్మాతలును న్యూటనున కేయంశమునందును దీసిపోని గణితశాస్త్రజ్ఞులై యున్నారు. ఏసీమనే కాలమున జన్మించినను ప్రాథమికమానవుడు తన భుజములపై న్యూటను బేకనుల వలెనే యుత్తమశీర్షమును వహించియుండెను. బుద్ధి యథాపూర్వమే జ్ఞానపరిమితి మాత్రము భేదించుచున్నది. శ్రుతులు సార్వకాలిక సత్యములగు జ్ఞానసూత్రములను బోధించుననియు, అన్యములగు నీశ్వరప్రవ

---

* 1. ఆవిష్కరణ మనగా నిచ్చట మఱుగులోనున్న ప్రకృతిసూత్రములు ఆదిగాగల వానిని కనిపెట్టి వెలికి తెచ్చుట.

* 2. పిరమిడ్ అనగా మంటి స్తంభము. ఈ స్తంభములు ఐగుప్తదేశమున గానవచ్చును. ఇవి చిరకాలముక్రిందనే ఆదేశీయులచే నిర్మింపబడినవి. వీని యడుగుభాగము విశాలముగనుండి సమకోణములు కలిగియుండును. ఎత్తునకు లేచినకొలదిని సన్నగిలి తుదకు సూదిమొనవలె నేర్పడును.

చనములు * ఆ ప్రత్యేక కాలములకై ప్రత్యేక కార్యార్థమై నిర్దేశింపబడిన భగవదాజ్ఞలం గూర్చి మాత్రమే ప్రసంగించుననియు దయానందుని యభిప్రాయము. ఇది సరియే కాని దయానందుడు వేదములనబరగు గ్రంథములలో నిజముగా జ్ఞానసూత్రములు గలవని ధృవపరుపవలసి వచ్చినప్పుడు కష్టము పొడసూపుచున్నది. దయానందుని వేదవ్యాఖ్యానము నైష్ఠిక విద్వాంసుల యనుమోదము బడయలేదు. దయానందుడు ప్రాచీన వేదపరిభాషయగు యాస్క విరచిత నిఘంటు నిరుక్తముల నాధారముగ గొనియున్నాడు. వారన్నను నవీన వ్యాఖ్యానముల నవలంబించి యున్నారు.

దయానందుని వ్యవసాయము ఫలోన్ముఖ మగునని మేము సహేతుక విశ్వాసము కలిగియున్నాము. తజ్ఞులిదివరకే జిజ్ఞాసతో వేదవిషయాన్వేషణమునకు బూనుకొనియున్నారు. ఆయన వ్రాసినదంతయును సత్యమును మూల్యమును గాకపోయినను గొంత వాస్తవిక లాభము చేకూరుట మాత్రము తథ్యము.

దయానందుడు సమస్తజనులను విచారణాచరణముల వైపునకు ద్రిప్పెను. అనగా నభ్యుదయ మార్గమున బెట్టెను. ఇదియే ఆయన యాధిక్యము. ప్రజాసామాన్యమునకు ప్రతిమార్చనా, వర్ణభేద సమస్యలను, విద్యావంతులకు నిర్బంధోచితవిద్యా, స్త్రీవిద్యా, బ్రహ్మచర్య, వితంతూద్వాహ ప్రశ్నములను విద్వాంసులకు వేదవ్యాఖ్యాన మాతృభాషా వ్యవసాయములను పరోపకారపరులకు నిమ్నజాతి సముద్ధరణమును దయాళురకు శాకభక్షణమును ఈసమస్యల నెల్లను ఆయన మన పురోభాగమునకు గొనివచ్చెను.

ఈ నానాముఖ ప్రయత్నములలో నాయన హృదయాంతరమున గాఢముగనుండిన విషయములు విశ్వజనీనైకధర్మమును సంయుక్త భారత

* ఆ. ఖొరాను బైబిలుగ్రంథములు కూడ నీశ్వరప్రోక్తములని విశ్వసింపబడుచున్నవి

వర్షమును. ఇవియే ఆయన యాశలు. ఇవియే ఆయన స్వప్నములు. వీని కొఱకే ఆయన కృషిచేసెను. వీని నిమిత్తమే ఆయన ప్రాణ మర్పించెను. కార్యమింకను కొనసాగలేదు. ఆయన యుత్సాహము మాత్రమింకను కృషిచేయుచున్నది.

హిందూపుత్రులకు ధైర్యములేదు; తత్పరతలేదు; ఉత్తమధర్మమునకై పోరాడ సమర్థముకాగల యవ్యాజధీర హృదయములేదు; స్వవిశ్వాస స్వప్రతిజ్ఞానుగుణముగ ప్రవర్తించుటకు సాహసములేదు:— ఇదియే హిందూమాతను పీడించు దురదృష్టములలో నెల్ల మహాదురదృష్టము. దయానందమునియం దెద్దియేని యుత్కృష్టగుణమున్నచో అదియాయన నంతత నిశాంతధైర్యమే. దయానందపాఠకుల చిత్తమున దృఢముగ నాటు దెద్దియన ఆయన హృదయము భయమెఱుగదు. చలనమెఱుగదు. సంశయ మెఱుగదు. ఈదేశమున నెందును బ్రవర్శితము కాని పటిశ్రమ కార్యాభినివేశము లాయనయందు సాకల్యముగా నుండెను విపక్షధైర్యవిదారకమగు నుత్తమమేధయు, అంతశ్శక్తిజనితమగు నాత్మవిశ్వాసమును ఆయనయం దవతరించియుండెను. 'ఈశ్వరుడు కాతర చేతస్కులచే తన కార్యప్రకటనమును జేయబూనడు.' అనువాక్య మెంతయును సత్యము.

అఖిల శాస్త్రహర్మ్యణ హిందూదేశము నాయనను ప్రతిశోధించి నిలిచియుండగా నిర్భీతుడై జంకు కొంకు లేక నగర నగరమునకును గ్రామగ్రామమునకును జనుదెంచి విగ్రహార్చనము శ్రాద్ధము బాల్యవివాహము అనాచారనీయములని బోధించుచు, పురోహితుల వంచక స్వభావమును మూఢవిశ్వాసములను ఖండించుచు, తమ పుత్ర పుత్రికలను విద్యావంతులుగ జేయు డని ప్రజాసంఘము నుద్బోధించుచు, సత్య జ్ఞాన స్వరూపుడును సర్వశక్తి సమేతుడును పరమ పితయు నగు నేకేశ్వరుని యారాధనము నుపదేశించుచు, జీర్ణపురోహితవర్గము స్వార్థభావప్రేరితమయి అధః

పతిత జనాంగముయొక్క యజ్ఞాన విశ్వాసములపై విధించిన కర్మాత్రవస్కా-రమును వర్జింప బ్రేరేపించుచు సంచార మొనర్చెను. కాని హిందూదేశము తన నిమ్న పదవియందే, తన యంధకారమునందే యుండగోరెను. బ్రాహ్మణ సంఘ మాయన పలుకుల నాలకింపలేదు. మీదుమిక్కిలి యాయన వాదమును తిరస్కరించుట నధికోత్సాహముతో ముందంజ వేసెను. అజ్ఞాన జనాంగము కాదట్లు కావించినది. వారే యైనచో క్షమార్హులగుదురు. అది విద్యావంతులు, పండిత ప్రకాండులు, మహార్షిసంతతులు, మునీంద్ర వంశ్యులు, నదియా కాళీఘట్ట మహామహోపధ్యాయులు, కాశీ శాస్త్రపండితులు, వీరే విగ్రహార్చనమును సమర్థించుటకు-ఇంతియె కాదు. పురస్కరించుటకు, ప్రశంసించుటకు ప్రతిమారాధనమును విధించుటకు ముందంజవేసిన ప్రతిభా సంపన్నులగు మొనగాండ్రు! దారు పూజాపక్షమున వారిచే విలిఖింపబడి వ్రాలుచేయబడిన పత్రిక వారి కీర్తికి శాశ్వత కజ్జలముగ నిలిచియుండును. పందొమ్మిదవ శతాబ్దాంతమున, జ్ఞానాభివృద్ధుల కాలమున, అత్యంత నాగరిక రాజ్యమున, ఏకేశ్వరారాధక ప్రపంచము దృష్టియెచ్చటనే వెలయుచుండగా, విద్వద్భారత వర్షము ప్రకాశమానమగు తన పూర్వ కాలమును విస్మరించి తనప్రస్తుత స్థితిని జూచి గర్వముతో నుప్పొంగుచు పరమపితృ పూజనమును దిరస్కరించి రాళ్ళ రప్పల సేవించుటయే యుత్తమ ధర్మముగా స్వీకరించుచున్నది !! ఆహా ! ఇది యెంత విషాదకరమును విస్మయ జనకమును నగు దృశ్యము ! విశ్వప్రపంచమును సర్వసృష్టియు దురంతచింతాజనితమానముతో నీ దృశ్యమును దిలకించుచున్నది !!

ఏ సంఘమున విశేష జనులు ఘనులో—అనగా వివేచనాశక్తియుక్తులో, తత్పర స్వభావులో, దృఢలోక జ్ఞాన సమన్వితులో, అధికోత్సాహ పూరితులో, ఆసంఘమే మహాజాతి యనబడును. వారిమనస్సులనాడబరచుటకు వితర్క మక్కఱలేదు. వారొక సమస్యయొక్క యుభ

యుపక్షములను గూర్చి చర్చింప బూనుకొనరు. వారొక్కక్షణము శాంతముతో తమ లోక జ్ఞానమును తమ సహజ స్వభావమును ననుసరించి యోజింతురు. సయుక్తికముగా సహేతుకముగా ప్రత్యుత్తర మీయక మీ యభిప్రాయమును బాటింపక, ఒప్పో తప్పో తాము సత్యమనియు యోగ్యమనియు విశ్వసించు నిష్కపటనిర్ణయమును నుడువుదురు. ఈశ్వరుడు మనకు దయచేసిన నిజమగు నిష్కళంక హృదయ మిదియే. నీవా హృదయమును సర్వసంఘములందును వాని పిన్నతనమున జూడగలవు. శతాబ్దములు పరిక్రమించినకొలదిని ఆ సారళ్యమును ఆ నిష్కాపట్యమును సంతరించి గడుసుదన మాప్రదేశ మాక్రమించుకొనును, ఈ కాలమున సర్వవిషయములును యుక్తి ప్రతి యుక్తుల మూలమునను, నిర్ణయప్రకట నానంతరము కలిగెడు, కష్టనష్టములను పర్యాలోచించిన పిమ్మటను తీరుమానింపబడు చున్నవి. కాశీపండితుల తీర్మానములు దయానందుని కనుకూలముగ నున్నచో—అనగా సత్యానుసారముగ నున్నచో వారికి నాధిక్యమెక్కడిది ? పరుల పరిశ్రమపై బ్రొవ్వుచున్న లక్షలాది బ్రాహ్మణుల గతి యేమగును ? ఇంతకంటె మహావిప్లవ మాపండితు లుండజాలదనుకొనిరి. వారి గుండె నీరయ్యెను

ఇది దౌర్బల్యముచే నుదయించిన గడుసుదనము. వారే ధీరపురుషులైనచో నీ యుపప్లవము నెదుర్కొని సత్కీర్తి నార్జించియుందురు.

ఇది యొక దుశ్శకునము. దీని వలన హిందువు లనుకూల సమయముల నుపయోగింప జాలని మంద బుద్ధులని ప్రకట మయ్యెను. వారికి వ్యగ్రోత్సాహము లేకుండెను. వారి యందింకను చైతన్యమున్నది. కాని యది సర్వాంగముల యందును సజీవముగ లేదు. యౌవన స్వభావమగు తత్పరత్వము గతించినది. జరాతురుని దూరాలోచనము మాత్రము మిగిలినది.

ఇంత నిష్ఫలప్రదమును భావి సూచనాశూన్యమును నగు క్షేత్రము నుండి దయానందుడు విరమింప ద్వరపడెనని కొందఱనుకొనవచ్చును. అటుల కాదు. ఆయనశక్తి వేరు- స్వకీయ సాహ సోత్సాహశక్తులాయనకు స్వ, పర బలములం దమిత విశ్వాసము నొసంగెను. హిందూదేశము జరాగ్రస్త మైనదని వచించునట్టియు, « ఏజాతిపునరుజ్జీవమున గాంచెను? రోము. గ్రీసు. ఈజిప్టు, బేబిలోను అన్నియు నస్తమించి పునరుజ్జ్వలము కాని జ్యోతిర్మండలము యొక్క దీనచరిత్రమునే వినుపించుచున్నవి ” అని విషాదవశుడై యుత్క్రోశించు తమోబంధుర హృదయుడగు నిరాశావాది యాతడు కాడు. మానవకోటికి సందేశ మర్పించుట కవతరించిన పురుషుడీచందమున నిరాశ చెందడు. ఆయన నివేదింపవలసిన సందేశ మొకటియున్నది. ఆయన దానిని సమర్పించును. ఏతత్త్వశాస్త్రమును, ఏప్రకృతి సూత్రవాదమును ఆయనను స్వీయకార్యమునుండి మరల్పజాలదు. ఆయన స్వశక్తిపై, ఈశ్వరసామ్యముపై, దేవకార్యముపై విశ్వాసముంచును. దయానందుని యుపన్యాసములును, ఉపదేశములును, సంవాదములును, నడచుచుండును, గ్రంథములు, పత్రికలు, అనువాదములు జయాపజయ విచారణము లేకయే, అనుమతి వ్యనుమతులను సరకుగొనకయే, బయలు వెడలుచుండును. ఆయన కివి లవలేశములు. ఆయన యనుసరించుటకు గాదు నడపించుట కవతరించెను. « జయాపజయవిచారము క్షుద్రహృదయముల నావేశించు పిశాచము ” మహాపురుషు లెన్నడును ఆధారావలంబములకై చూడరు. జనాభిప్రాయము వారి వర్తనము ననుశాసింపజాలదు.

హిందూ దేశమునకును పునరభ్యుదయమునకును నడుమ రాతిగోడను నిర్మించు ప్రకృతి సూత్రమెద్దియేని కలదేమో విచారించుట హృదయంగమము. నిశ్చయముగా నీప్రపంచ మనేక పరివర్తనముల గాంచినది. కాని యొకప్పుడేని పూర్వస్థితి పునఃప్రదర్శితము కాలేదు. పరివర్త

నమే ప్రకృతియొక్క ముఖ్యసూత్రము. ఏప్రదేశమున నొకప్పుడు మహా సాగరము పరిఢవిల్లెనో యాప్రదేశమిప్పుడు విశాలమగు 'సహారా' యెడారియైయున్నది. రోము, ఏథెన్సు, బేబిలోను మన మెన్నుదును పేరైన వినియెఱుగని మఱియెన్నియో సామ్రాజ్యములు ప్రకాశించి యంధకారమున నంతరించెను. బర్లిను, ప్యారిసు, న్యూయార్కు నామము లాస శేషపట్టికయందు జేరు దినము రాజాలదని యెవ్వరనగలరు? తన మధ్యాహ్నకాలమున రోము నగరము నేటి లండనువలెనే మహాతేజముతో, నాకాశశిఖరమునంటెను. అది యంతటితో నంతరించుట కెద్దియేని దౌష్ట్యము దాని యందుండెనా? లేదు. ఈయఖిలమును గావించినది పరివర్తనమే. కాల మెద్దాని యునికిని ఓరువజాలదు. నిత్యనవ్య లీలాస్ఫురణములగు నేటి నగరరాజములు గాని మనలనెంతో గర్వితులను జేయు కళా, విజ్ఞానములు గాని నిత్యముగ నిలుచునా? పిరమిడ్ నిర్మాత లసామాన్యులే! వారే మైరి? వారు సురభీకృతులై భూమాతృగర్భమున విశ్రమించుచున్నారు. వారిశిల్పము నశించినది. వారిభాష యంతరించినది. ఆహా! భాషాపరివర్తనమెంత విచిత్రము! భాషా వాచకుల తరతరశ్శృంఖలము వీడిపోదు. కానిభాష మృగ్యమగును. రెండు వేలేండ్లయల్పకాలము గడువనిండు. నేడు కోట్లకొలది జనులు సంభాషించు, విలిఖించు, గానముచేయు, భాషశూన్యమున విలీనమగును. మఱియైదు వేలేండ్లు పోనిండు. నేటి యైరోపియనుల వలె లేక నిన్నటి యార్యులవలె నత్యుత్సాహపూర్ణమగు మఱియొకజాతి కాదు పెక్కుజాతులుదయమంది విరాజిల్లగలవు. కాని వారి యుత్సాహాభివృద్ధులు నూతనమార్గమున బ్రసరింపవచ్చును.

ఎందుచేత? ఎట్లు? మనల నౌన్నత్యమునకు లేవదీసిన ప్రకృతి శాస్త్రములు వట్టి యూహాపోహములు గావు. అవి సరియైనశాస్త్రములు ఏసూత్రానుసారముగ నేడు ధూమశకటములను తంతీవార్తయు నడుప బడుచున్నవో ఆసూత్రానుసారముగనే పదిలక్షల వర్షముల కావలను

వాని నడవుట సుసాధ్యమగును. అవును ప్రస్తుతపరిస్థితులే యానాటివరకు నుండినచో నది సాధ్యమగును. కాని యాస్థితులే నిలుచునను నిశ్చయ మెక్కడ ! పూర్వప్రమాణమెద్దియు నిందులకు గానరాదు. ఉన్నవన్నియు విరుద్ధఫల దర్శనములే, ఆరువేలేండ్ల యల్పకాలము క్రిందటి దెద్దియు నేను గానరాను. ప్రపంచముయొక్క సర్వపరిస్థితులును మార్పుచెంది, నేటి భూభాగమంతయు మహాసముద్రముగ బరిణమించి, ధ్రువప్రదేశములు నివాసయోగ్యములకై జనాకీర్ణములగు నాడు, ఒక నూతన జాతి యుత్పన్నమై మనభూమాశకట తంత్రీవార్తలకంటె నితరములగు నూత్నకల్పనముల విజయముచే గర్వము చెందవచ్చును.

మానవుని స్మృతి మిగుల పరిమితమైనది. ఆతడు భూతకాలమున నేరూపమున నెచ్చట నుండెనో నిశ్చయజ్ఞానముతో వక్కాణింపజాలడు. ఆతనిభావిదర్శనశక్తియు మిక్కిలి స్వల్పమయినది. భవిష్యత్కాలమున నాతడెచ్చట నేరూపమున నుండునో నుడువజాలడు.

హిందూదేశము తన విగతస్థానము నాక్రమించు కొనలేకపోవచ్చును. 6000 సంవత్సరములకు పూర్వమందును ఇంకను పురాతనకాలమునందును ఆమె యధిష్ఠించిన గౌరవపదమును నేడధిగమింపక పోవచ్చును. కాని యామె సుందర సుఖజీవన మనుభవించుట కాతంకమేమి కలదు ? ఆమె మున్నొకమారు భౌతికాధ్యాత్మికాభ్యుదయశిఖరము నధిష్ఠించినది. కావున నింక నిరంతరము పంకమున బడి పొర్లాడుచుండవలసినదేనా ? అది మాప్రకృతి సూత్రము కాదు. ఆమె యిప్పుడు నిశ్రేణి యొక్క యట్టడుగు మెట్టుపై నిలిచియున్నది. ఇకనున్నతికి లేవవలెను. లేదా నశించవలెను. ఇంతకంటె వేరుగతిలేదు. అయితే ప్రళయ చిహ్నములు గానవచ్చుటలేదు. దివారాత్రములు, ఉత్థాన పతనములు, వృద్ధిక్షయములు ఇవియొకటి వెంబడి నొకటి యరుదెంచెను. హిందూదేశ పక్షమున మాత్రమీసూత్రము వర్తింపనిచో దానిని మృతప్రాయముగ

గొట్టివేయవచ్చును. అప్పుడు హిందువులు దుర్గతిపాలై దుఃఖదుర్భరజీవనము శాశ్వతముగ గడుపవలసిన కాలమే తెంచవచ్చును. వారు శీఘ్రముననే నశించవలెను. లేదా నవజీవనముతో వికాసము గాంచవలెను. గతించిన రెండు మూడు శతాబ్దములును వారు ప్రళయోన్ముఖులు గాక సంస్కరణ మార్గమును నవజీవనపథమును బట్టి పోవుచున్నారని ధృవపరచుచున్నవి. వారి యాకాశమున జ్ఞానాభివృద్ధుల నూతన శక మూదయించినది. వారిచలనము మందమైయైనను వారు నిశ్చయముగా పూర్ణతరవికాసముగల నవజీవన మార్గమున నడచుచున్నారు.

ఒక రిద్దఱు కాదు వందల కొలది విద్యావంతులు భగవదారాధనముకంటె శిలాపూజ యుత్తమ మను తీర్మానమున కెట్లు వచ్చిరి ? అని సంశయముతో గొంద ఱక్కజ మందవచ్చును. వారు నిష్కళంకహృదయులు, న్యాయశీలురు, యథార్థపరులు నైనచో, వారు వేదములు విగ్రహార్చనమును విధించుచున్నవని నిశ్చయముగ విశ్వసించిరచో సోదరా ! నీవు ప్రతిమారాధనా ఖండనమున శ్రుతి ప్రామాణ్యమును గైకొని పొరబడితివోయీ. అవి విగ్రహార్చనమును విధించుచున్నవి. ఆయా వాక్యములం జూడుము, అని యేల వచింపక పోయిరి ? ఒకవేళ నట్టివి కానవచ్చునేని యవి ప్రక్షిప్తములై యుండును. ఏలయన శ్రుతుల ప్రధానభావ మీయాచారమునకు విరుద్ధముగ నున్నది. ఇంతియె కాక ప్రతిమార్చన మధమ మనియు, పరమపితకును పరిపూర్ణాత్మకును గూడ ననుచిత మనియు, మనుజునకును, నరపశువునకును నడుమ సంయోగ నిమిత్త మగు నీచమానవునికి మాత్రమే పాత్రమనియు మన మెంచ దలంతుము. అట్టి నీచమానవులు నేటి భిల్ల, శాంతాల జాతుల వలె శిలా, దారువుల నారాధింపవచ్చును. కాని మనము—మహర్షివర్షులయొక్కయు మహాయోగీంద్రులయొక్కయు సంతతులమగు మనము—ప్రపంచము సంపదతి ప్రాచీన నాగరికతా విభవమునకు దాయ స్వామ్యమును స్థాపించు

కొనజూచు మనము పరమేశ్వరుని మనకు నాతనికి నడుమ నే రాతిమాధ్యముము లేకయే సూటిగా నారాధింపగలము. విస్పష్టమును, సుగ్రాహ్యమును నగు నీ ఋజుమార్గమును వీడి పరిష్కృతాచార పరాయణులు సమగ్రశ్రుతిభాన విరుద్ధమగు నే మూరుమూల వాక్యమునో లేవనెత్తి 'వేదములు విగ్రహార్చనమును పురాణముల యందలి ఘోరకృత్యములను నంగీకరించు చున్నది; కావున పరమేశ్వరారాధనముకంటె శిలార్చనమునే యవి శ్రేష్ఠతరముగ నెంచుచున్నవి' అని వాయెత్తి ఘోషించిరి.

అయ్యో! మానవుని దృష్టికి నిరోధము కలిగినప్పుడే మార్తాండు డాతని మార్గమును బ్రకాశింపజేయగలడు? ఈపండితులకు విశేషజ్ఞానముండవచ్చును. కాని మనకు వివేచనాశక్తిని బ్రసాదించు దైవిక ప్రేరణము వారియం దత్యంత మృగ్యముగ నుండెను. ఉత్తమ గ్రంథములును మహావైద్యుని సహాయ మొనర్ప గలుగును కాని పరివర్తింప జాలవు. విత్తనము లేనిచో నెట్టి జలసేకమును అంకురము నుత్పాదింప జాలదు. ఒక యువయువము వికల మగునెడలను, వ్యాధిగ్రస్త మగునెడలను అది సరిగా పనిచేయజాలదు. ఎంతటి వైద్యుడును మూర్ఖుని జ్ఞానవంతునిగ జేయలేడు. ప్రపంచ మట్టి యద్భుతము నింకను జూడవలసియే యున్నది. 'దేవతలే మూర్ఖత్వముతో విసిగి వేసారి విడిచిపెట్టిరి.'

వాస్తవ మేమనగా వివిధ మానవులును వివిధపరిమితుల మేధాభివృద్ధి గలిగియుందురు. ఏ మనుజుడును నైజబుద్ధికంటె నధిక వివేకమును బ్రదర్శింపజాలడు. తత్త్వజ్ఞాని యగు ఎమర్సను ఇట్లనుచున్నాడు. 'మన మేయోచనయందు మగ్నుల మగుచున్నామో అది తప్ప నన్యము మన మానసమును జొరజాలకుండుట యాశ్చర్యకరము. పూర్వప్రయత్నము లేక యెవ్వడును నూతన విషయమును తన దృష్టికెంత సమీపమున నున్నను గ్రహింపజాలకున్నాడు. ఒకరసాయనశాస్త్రవేత్త వడ్రంగికి దన శాస్త్రరహస్యముల నెంతయు విశదముగ జెప్పవచ్చును. కాని యావా

క్యము లాతని చెవిని జొరవు. దేవుడు నిరంతరమును అకాలోద్దేశము లను మనకు మఱుగు చేయుచుండును. మనస్సు పక్వమగువంత వరకును మన కన్నుల కట్టెదుట నుండు విషయములను సహితము మనము కనుగొనజాలము. జీవితమునంతయు విగ్రహార్చనము నందును దారుఖండముల జెక్కుట యందును వినియోగించు నాతడు ఒక్క పర్యాయముగ నభ్యాసమునకందె నున్నతస్థానమున కెగురగలుగును? కావున దయానందుడు పండితులకు బోధించిన సూక్ష్మ సత్యాంశములు వ్యర్థము లగుటలో నాశ్చర్యము లేదు. లోకజ్ఞానమువలె నాశ్చర్యకరమగు విషయము మఱొండు లేదు. సంస్కర్తకును నైష్ఠికునకును గల వివాదము ప్రాత సంగతియే. వారుభయులు రెండునియమములకును ప్రతినిధులు: ఉత్సాహము—జడత, వృద్ధి—స్థితి. సంస్కర్త యెప్పుడును ముందడుగు వేయును. నైష్ఠికుడు వెనుకకు జూచును. సంస్కర్త లేకుండినచో ప్రపంచము దురాచారముతోడను అధర్మముతోడను మునిగిపోయి యుండును. కాని ప్రకృతి సూత్రములచే నట్లు పొసగదు. సంస్కర్త స్వధర్మమునుండి సంచలింపడు. ఆతడు స్వధర్మ నిర్వహణము నకై కాయకష్టములైన ప్రాణములనైన సంతోషముతో హృదయపూర్వకముగా సమర్పించును. ఆశ్చర్యము! ఒక్క దయానందుడు కాశీ పండితుల మహాసంఘమంత యాత్మిక బలసంపన్నుడై యుండెను. ఎవ్వ డనుపమాత్మిక బలుడో, ఎవ్వడు సౌఖ్యదాయకమగు గృహమును, ప్రియ బంధువులను విడనాడి సమస్తైహిక సౌఖ్యములను సన్యసించెనో, ఎవ్వడు సహజస్వభావముచే యథార్థ ప్రతిమాభంజకుడో, ఎవ్వడు మనుజుల నీచోన్నత భేదమును పరిగణింపడో, ఎవ్వడు వజ్రకర్కశ హృదయుడో, ఆదయానందుడు తన గౌరవాస్పదముకాని వివేక శీలములు గల పండితులతో నెట్లు కలసిమెలసి యుండగలుగును? ఎవ్వరి యభ్యుదయము కొఱకు భక్తిశ్రద్ధలతో స్వార్థపరిత్యాగ మొనర్చుచుండెనో అట్టి జనులయొక్క యే

ద్వేష దూషణాధిక్షేపములను, శిలాక్షేపాది ప్రాణాపాయకర కృత్యము
లను శాంతముతో సహించుకొను నట్లు ఏ స్థిర ప్రేరణము, ఏ అయ
స్కాంతాకర్షణము జేయగల్గెను? ఈప్రపంచమును తన్నిర్మాతయగు భగ
వంతుని జాగ్రతకే వదలి భాస్కరానందునివలెను విశుద్ధానందునివలెను
ఒక విద్వాంసుడుగనో, యోగిగనో, స్వామిగనో యాయన తన జీవిత
కాల మేల గడపకుండెను? పవిత్ర యశస్వులగు సాక్రటీసు క్రాన్మరు
మున్నగా గల స్వార్థత్యాగులు స్వీయాభిప్రాయముల నిమిత్తము తమ
దేశీయ సోదరుల మూర్ఖత్వమున కేల బలియైరి?

నిశ్చయముగా శిలా దారుఖండములకంటె స్వల్పతరదృష్టి మాస్వ
రూపములుగల యే యన్యపదార్థమును ఆరాధింప నశక్తులమని ఘోషి
ల్లిన కాశీ కాళీఘట్ట పండిత సమాజముకంటె కేవల స్వకీయాభిప్రాయా
ర్థము హృదయ శోణితమును స్రవింపజేసిన యొక్క సాక్రటీసును ఒక్క
దయానందుడును మహాద్భుత జనకముగు ప్రకృతి విషయముగా వెలయు
చుందురు.

## ద్వితీయధ్యాయము



### బాల్యము

శ్రీ దయానందుని బాల్యమును గూర్చి మనకంతగా దెలియదు. 1875 వ సంవత్సరములో పునహానగరమునం దాయన యుపన్యసించుచు తాను 1824 సంవత్సరమున కథియవారులోని మోర్వి గ్రామమున జన్మించినట్లు నుడివియుండెను. ఆయన జనకుడెవ్వడో మన మెఱుగము. కొందఱు చదువరుల కిది చిత్రముగ దోచవచ్చును. కాని సన్యాసులు తమ సంసారబంధములను విస్మరింపవలెననియు, సకలైహికవాంఛలను సమయింప వలెననియు, యుష్మదస్మద్విభేదము విడనాడవలెననియు నియమములకలవు. ఆయన తండ్రియా? ఆయన గృహమా? అదృష్టవశమున నాయన శాశ్వతముగ నాబంధములనుండి వినుముక్తుడయ్యెను. ఆయన కీప్రపంచమున 'నాది' యను పదార్థమెద్యదియు లేదు. ఆయన యొక బ్రాహ్మణ వంశోద్భవుడు. ఆయనతండ్రి యొక పండితుడు. సంస్కృత వాఙ్మయమునందలి మతగ్రంథముల సారమును జూరగొన్నవాడు. వసతి వాడలు గలిగియుండి సామాన్యముగా బ్రాహ్మణులవలె సంభావనములపై నాధారపడియుండక యొక స్వదేశ సంస్థానమునందు జమాదారుగ (పన్నువసూలుచేయు నుద్యోగి) గొలువుండి ధనసంపాదనము చేయుచుండెను. ఆయనకు గొంత వడ్డీవ్యాపారము కూడ నుండెను. దయానందుని కొక పినతండ్రి యుండెను. ఆయన మంచిభక్తుడు. విద్వాంసుడు. దయానందుని కాయనయం దత్యంతానురాగము గలదు. ఆయనతల్లి పావనియు కోమలహృదయయునై వెలయుచుండెను. దయానందునికైదేండ్లయిన రాకమున్నే సంస్కృతాధ్యయనము ప్రారంభమయ్యెను. ఆయన ప్రథమ

మున పితృచరణసన్నిధినే విద్యాభ్యాసము కావించియుండె ననుటకు సందియము లేదు. అష్టవర్షప్రాయమున నుపనీతుడై బ్రాహ్మణుడుగ పునర్జనన మొందెను. ఇంతటినుండియు నాయన సంధ్యావార్చుచు స్వధర్మము నాచరింపవలసియుండెను. బాల్యదినములు గడచినవి. స్వధర్మజీవనము ప్రారంభమయ్యెను. హిందూదేశమున అయ్యో! ఇంకను మనహిందూదేశ మెక్కడ? శాస్త్రప్రకార మనవలెను. విద్యతో ధర్మావృత్తియు ప్రారంభమగును. విద్యాభోధన మొకధర్మము ప్రత్యాఖ్యానకును ప్రథమ కర్తవ్యము. దయానందుడు శైవధర్మప్రకారముగా శిక్షింప బడుచుండెను. ఆయన తండ్రి శైవుడగుటచే పుత్రుడు శైవమతావలంబిగనే యుండవలెనని యభిలషించుచుండెను. ఉపవాసము లుండవలెనియు, మృత్తికావికారమగు శివలింగమును బూజింపుమనియు, జాగరములు చేయుమనియు, జనకుడు విధించుచుండెను. తండ్రి క్లేశములన్నియు విధాయకములు సంతృప్తికరములు. కొమరున కివియన్నియు కేవల నిరర్థకములు ఆయాసజనకములు. ఈవిధులచే దయానందుని మాతాపితలకు జగడము కలుగుచుండెను. కొడుకు శిష్టాచారసంపన్నుడై మతవిధులను క్రమముగ నిర్వహించు చుండవలెనని తండ్రి దృఢాశయము. కావున పుత్రుడే మాత్రము విధి తిరస్కార నొనర్చినను మండలించుచుండెను. చీవాట్లు పెట్టుచుండెను. తల్లి తన సహజ కోమల స్త్రీస్వభావముతో ఆతడు పసివాడనియు, సుకుమార శరీరుడనియు దలంచి కొమరుని బ్రోత్సహించుచుండెను. శిక్ష (తరబీయతు) విద్యయొక్క ప్రధానభాగము తనయుని దోషములను దండించి సత్పథమున బెట్టని తండ్రి యమిత హాన్యపరాధములను జేసినవాడగును. ఈకర్మాచరణముయొక్క యాంతరంగిక ప్రయోజనమెద్దియైయున్నను దయానందుని జీవితమున ముఖ్యముగ గానవచ్చు క్రమత, పట్టుదల పరిశ్రమము మున్నగు సద్గుణముల నేర్పరచుటలో నది మిక్కిలి సహాయజనకమయ్యెను. శిక్ష మన ప్రస్తుత విద్యా విధానములో

నొక యంగముగ నుండుటలేదు. మనము మా బాలురకు మేధా శిక్ష మాత్రమే యొసగి వారి ప్రవర్తనము జోలికేమాత్రమును బోము. వారు దుష్పథముల బ్రవేశింపకుండ మనము స్వల్పముగా మాత్రమే భద్రతవహింతుము అయితే తనయుని విషయమై తండ్రికిగల బాధ్యత యంతమాత్రముతో సంతసమగునా! మన బాలురు సక్రమ, సత్య, స్వభావోపేతులగునట్లును స్వకర్తవ్యములను తత్క్రియా విధానములను గ్రహించుట మాత్రమే కాక విధిగా నాచరించునట్లును మనము ప్రయత్నము చేయనక్కరలేదా! మనుజునకు స్వధర్మ పరిజ్ఞానము మాత్రమే చాలదు. అతడు స్వీయవిధుల నాచరించునప్పుడే, వానిని జీర్ణించుకొని తన యభ్యాసములుగ జేసికొన్నప్పుడే యుత్తమపురుషు డనిపించుకొనును మన బాలురలో బహుసంఖ్యాకులు ప్రార్థన సలుపుట యెఱుగనే యెఱుగరు. వారు మూఢులుగను మడ్డివారుగను బెరుగుచున్నారు. ఫలితమేమి? వారు పెద్దలై స్వధర్మములను గ్రహించి యాచరింప యత్నించియు విఫల మనోరథు లగుచున్నారు. కావున మన యువకులు ప్రౌఢ ప్రాయమున నేయే కర్తవ్యములు నిర్వహింపవలసియుండునో, ఆయా ధర్మములను చిన్ననాటనుండియు నభ్యసించు లాగున జేయుట మన విధాయక కృత్యము.

ఈవిధముగ నాయన జీవితమున పదమూడేండ్లు విశేషాంశరహితముగ నేకరీతిని గడచెను. మానవ జీవితము సామాన్యముగా రిక్తముగ నుండనేరదు. లెస్సగా బరీక్షించితిమేని క్షుద్రతమ జీవితమును మనకు గొన్ని నూతనాంశములను బోధింపగలుగును.

దయానందుని బాల్యమున ప్రవర్తిల్లిన రెండు ముఖ్య వృత్తాంతములను గమనింతము. అందు విశేష మేమియు లేదు. అవి సాధారణాంశములు అనుదినమును ప్రతిఘటికయు నట్టివి పెక్కులు మనకు గానవచ్చుచునే యుండును. వానిని మనము పరిశీలింపనైన బరిశీలింపము.

అవి దయానందుని జీవితమున పరివర్తకాంశము లయ్యెను. ఈ యొక్క వృత్తాంతము నాలకింపుడు. ఒక యెలుక తన బొరియనుండి వెలివచ్చును. ఒక విగ్రహముయొక్క శిరస్సుపైకి దుముకును—దీనితో చిరకాలసమాగతమగు నంధకారము దయానందుని హృదయమునుండి పటాపంచలై పోవును. స్వకుటుంబములో నొక మరణము తటస్థించును. దీనితో మానవజీవితమును గూర్చిన సమగ్ర తత్త్వమును విశదముగ విడిపోయి నుతి చెఱుగకుండ శిలాక్షరములవలె చిత్తమున నిత్యముగ నాటుకొనును.

వివరమేమనః—

హిందూదేశమున ననేక స్థలములలో శివరాత్ర్యుత్సవము సలుపబడుచుండును. నాదనంత విశ్వజాలము యొక్కయు సర్గ స్థితి సంహారణ కారణుండగు శివమహాదేవుని యారాధనలు జరుగును. ఈ యుత్సవము మాఘ బహుళ చతుర్దశినాడు వచ్చును. 1837 వ సంవత్సరము మాఘ బ ౧౪ ఆర్యసమాజ చరిత్రములో నొక శుభదినముగను స్మరణీయ వాసరముగను గణింపదగును. ఈ నాటి యుపవాసమే లేకున్నచో దయానందుడు—ఆర్యసమాజము—ప్రబోధము—హిందూదేశ పునరభ్యుదయము— యేమియు లేకుండెడిదే. మాఘ చతుర్దశి యేతెంచును. దయానందు డుపవసింపవలెనని తండ్రి పట్టు పట్టును. నవనీతచేతయగు మాత బాలుడని వారించును. కాని యామె వారింపులు సాగవు దయానందు డుప వసింపక తీరదు. ఈ మహేశ్వరుడు వృషభ వాహన మెక్కుననియు, డమరువు మ్రోయించుననియు, భువన జాలమును సృజించి సంహరించుననియు, మఱి యెన్నియోకథల నా బాలు డీవరకు వినియుండెను. ఆ కథ లీతనికి విచిత్రములుగ గన్పట్టును. జనకునివలెనే పుత్రుడును నధికోత్సాహముతో నుపవాసముండును. పగలు గడచును. రాత్రి యేతెంచును. ఇంటి నుండి యరమైలు దూరమున నున్న యొక దేవాలయమున కాతడు పోవలెను. అతడచ్చట రాత్రి జాగరము చేయ

వలెను. తండ్రి కొడుకు లిరువురు నచ్చటి కరుగుదురు. ఈ దృశ్యవృత్తాంతము మనకు వివరముగా దెలియును. కాని హిందూపుత్రులా దేపళ మెట్లుండునో సులభముగా నూహించు కొన గలరు. దీపావళీ విరాజమానమగు దేవాలయము—భూసుర సమూహము—భక్త బృందము—సొంపుగా (అ దేమి సొంపో) అలంకరింపబడిన రుద్రదేవునివిగ్రహము—దళ, పుష్ప, ఫల, మోదక (మదకరము లగు సమస్త శాకద్రవ్యముల కును శివు డధిష్ఠాన దేవత) సంచయ సమర్పణము—నిరంతర ఘంటా నినాదము—శంఖానిర్ఘోషము—దశదిశా ప్రసరిత ధూప సౌరభము—భక్తి గీతాగానము మంత్రపఠనము—నీరాంజనము.

పూజలు ముగియును. ఉపవసించిన భక్తులు మెల్లగా కునికిపాట్లు పడుదురు. జాగరము మిగుల కష్టమైన పని. అర్ధరాత్రము గడచును. దయానందుడు తప్ప నెల్లరును నిద్రావివశులగుదురు. ఆతని బాలహృదయ మొక్క నిముసము సుఖమున కై యాత్మభంగ మొనర్చుకొనుట కనుమతింపకుండును. ఎట్టి విప్లవము—సర్పసయ్యాదు అహమ్మదు నుడివినట్లు ఎట్టి యీశ్వరాదేశ మాతని కట్టెదుట నుండెనో పాప మా పసిబాలు డిసుమంతయేని శంకింపడు. ఆతడు కనులు తెరచి బుద్ధిని విప్పి కూరుచుండును. ఇంతలో నొక యెలుక తన కన్నము నుండి వెలువడును. అది యా సృష్టి సంహారణ కర్త నెత్తిపై కెక్కి దుముకు లాడును. అచ్చటి నైవేద్యములగు గుడాన్నములను కొంచెము కొంచెముగ కొఱికి తినును. దయానందు డిది చూచి యాశ్చర్య మొందును. ఆతని కోమల హృదయము సంచలించును. అంతటి మహాశక్తిసంపన్నుడగు నీశ్వరుడు—నిఖిల జగత్కర్తయు భర్తయు హర్తయు నగు నీశ్వరుడు—పరిశుద్ధులై కాక, దుకూలధారులై కాక భూసురులే స్పృశింప సాహసింపని యీశ్వరుడు ఈ విధముగా నొక మలిన మూషికముచే మైలపడి రవ్వంతయైన నాగ్రహముతో నదలకింపకుండుటకు హేతు వాతడు గ్రె

హింప నేరకుండును. దైవములను దేవతలను దండించు నాతఁడొక యెలుక పిల్లను దూరీకృతముగ జేయలేక పోయెను !

సర్వశక్తి సంపన్నుఁడని పిలువబడు నా దేవాలయమునందలి యీశ్వరు డాతని కింక దేవుఁడుగ దోచఁడు. అనంత విశ్వజాలమునకును ప్రళయోదయ కారణుండని జెప్పబడు నామహేశ్వరు డాతనికి మానవహస్తము చెక్కిన నిర్జీవమగు రాతి బొమ్మవలె గన్పట్టెను ! అయినచో నీ యుపవాస జాగరము లేల ? ఈ నిర్జీవచైతన్య ప్రతిమా సమారాధన మెందులకు ? ఇట్టి మన స్సంకటములగు నాలోచన లాతనికి మానసమున నెన్నియో తరంగించును. ఆతఁడు వాని నణంపజాలఁడు. అవి మిగుల బలమైనవి. సత్యమైనవి. మన యువకులలో నొందఱు మన తండ్రి తాతల కంటె నధికులము గామనియు, పరమేశ్వరుని విధానములు మనకు విమర్శనీయములు గావనియు దలంచి తమ సందేహములను, సూక్ష్మమానసిక శక్తులను జంపివేసికొనుచున్నారు. అట్టి వాఁడు కాఁడు దయానందుఁడు. తోడనే యాతఁడు తండ్రిని మేల్కొలిపి 'గ్రంథములలో జెప్పిన శివుఁడు మన యెదుట నున్న శిలావిగ్రహమేనా ?' యని ప్రశ్నించెను. తండ్రి కోపించి—ఇది సహజము:—'నీ కీ యసంగతము, అవినయము నగు ప్రశ్న యేల ? దోషము వచ్చును సుమీ !' యని మందలించెను. అంతట దయానందుఁడు ''గ్రంథములలో జెప్పఁబడిన శివుఁడు సర్వశక్తిసమేతుఁడు, సర్వజ్ఞుఁడు, కాని యీ దేవాలయమునందలి విగ్రహము కేవలము నిర్జీవము. ఒక యెలుక దాని తలపై నెక్కి గంతులు వేయుచుండగా నే జూచియుంటిని. కాని యావిగ్రహ మెప్పటి యట్లనే కదలకుండెను. అని జవాబు చెప్పెను. ఆ మీఁద తండ్రి ''అవును. ఇది నిక్కమైన దేవుఁడు కాఁడు. ఆయన యాకారము వేఱు. ఆయన యునికి వేఱు. ఆయన కైలాస మందుండును. నీ మానవ నేత్రములతో నీ వాతని నెట్లు చూడ గల్గుదువు ? ఆయన దర్శనము మనకు దొరుకదు.

ఇది యజ్ఞానాకారమును పాపభూయిష్ఠమును నగు కలియుగ మన్న సంగతి తెలియదా ? దేవతలు మనుష్యులతో భూమిపై సంచారము చేయుట మాని రని నీ వెఱుగవా ? ఈ విగ్రహమునం దేమియును లేదు. నిజముగా నది వట్టి రాతిబొమ్మ. కాని యందఱి వలెనే మనమును చూపున కందని యా మహేశ్వరు నీ విగ్రహమున నావహింపజేసి పూజ చేయుదుము. ఈ విగ్రహ మాతని యునికిని దెలుపుచు మన దృష్టి చెదరకుండునట్లు మాత్రము తోడుపడును." అని బోధించును. దయానందు డూరకుండును. తండ్రి వాక్యము లాతని సంతృప్తి పఱుపజాలవు.

మీ రాయనను విగ్రహమునం దావహనము చేయుదురు. అందు సందేహము లేదు కాని ఆయన మీ యాహ్వానము నంగీకరించి యందు సాక్షాత్కరించె ననుటకును మీ బ్రాహ్మణత్వ మాయనను దయదలచి పొమ్మను నంతవరకు నందు సాక్షాత్కరించి యుండు ననుటకును నిదర్శన మెయ్యది ? ఆహా ! భగవంతునికి యథార్థ పూజాపీఠమగు మీ హృదయాంతరమున కేల నాతని నాహ్వానము చేయ జూడరు ?

దయానందు డింటికి మరలి పోవుటకు తండ్రి యనుజ్ఞ గైకొనును. 'అన్న మారగింపకుమీ !' యని తండ్రి కడసారి చెప్పును. ఆతడీ మాట గణింపకయే సేవకు డొక్కడు వెంటరా నింటికేగును. పిదప గొన్ని మిఠాయీలను భుజించి ప్రతిమారాధనమును, ఉపవాసమును — సర్వమును నవలద్రోచి నిదురించును.

ఆశ్చర్యము ! దయానందునివంటి బాలుడు రాళ్ళను కొయ్యలను పూజించుట యందలి యవివేకమును నిష్ప్రయోజనమును గ్రహింప గల్గును. కాని జ్ఞానసంపన్నుడును లోకానుభవశాలియు నగు ప్రౌఢుడు దానియందలి చెడుగు తనకు జూపబడినను గ్రహింప జాలకున్నాడు. దయానందుడు తండ్రి యనుమతితో విగ్రహార్చనమును ఉపవాసములను వీడి తన సర్వకాలమును విద్యార్జనమునకై వినియోగించు చుం

మును. ఇట్లు రెండేండ్లు గడచును. మరల నొక విశేషవృత్తాంతము జరుగును. దయానందుని కొక ప్రియ సోదరి యుండును. ఆమె యాతని కంటె రెండేండ్లు పిన్న. అక్కన్య యకస్మాత్తుగా “కలరా” వ్యాధి తగిలి మృత్యువు వాత బడును. దయానందుడు మృత్యుదేవతయొక్క భీకరాకారమును తొలిసారి చూచి భయకంపితుడగును. ఆయన తన గతిని తన యంత్యకాలమున దానెట్లు మృత్యు దేవత కరాళముఖమున బ్రవేశింపవలెనో, ఎట్లు పునరుదయము నొందవలెనో, ఎట్లు మరల మరణింపవలెనో, అనేక పర్యాయము లెట్లు పుట్టుచు గిట్టుచు నుండవలెనో, నిత్యమున నిట్లెన్ని యావృత్తులు తిరుగవలెనో ఎట్లు సర్వమును వినాశమొందవలెనో, ఎట్లొక్కటియు నిలువజాలదో, ఎట్లు దృఢముగ గన్పట్టు నీ ప్రపంచమైన వినాశమునుండి తప్పించుకొనజాలదో, ఎట్లు తన బంధు బృందమును, మిత్రవర్గమును, ధనాదులును, సమస్తమును గతింపవలెనో - ఈ సర్వమును దలంచుకొన్నప్పు డాయనగుండె బ్రద్దలయిపోవును. దయానందునికి వానితో నేమి పని యున్నది ? వానికి దయానందునితో నేమి ప్రయోజనము ! వానికి పరస్పర సంబంధమేమి ? సర్వమును ఏక ఫల ప్రాప్తికి సాధనము లనుట తప్ప వాటి యన్యసంబంధము లేదు. మనము పరికరములనే ఫలముగా నెంచితిమేని, ఈ జీవితము నొక యున్నత ఫలావాప్తికి సాధనభూతముగ గాక ఫలముగనే తలంచితిమేని మనము ప్రణాశము చెందుదుము. మన జీవితాదర్శము మన జీవితోద్దేశము మన చుట్టును గానవచ్చు పదార్థ సంచయమును కష్టపడి విభాగించుకొనుటయు స్వాధీనపరచుకొనుటయు గాదు. అది దీనికంటె భిన్నమును శ్రేష్ఠమునయి యున్నది. ఇంత దనుక దయానందుని కన్ను గప్పిన యజ్ఞాన పటలము కరిగి పోవును. ఆయన సావధికభౌతిక ప్రపంచద్వారమున నిరవధిక నిత్య స్వరూపమును సందర్శింప గలుగును. ఆయన యొక మార్గమును నిర్ణయించుకొనును. ధ్రువసంకల్పు డగును. ఇంటివారి నుండియు

శరీర సౌఖ్యము కాక యాత్మక్షేమము మాత్రమే యాయన దృష్టి నాక ర్షించును. తన యొక్కయు పరులయొక్కయు నాత్మసేవనమే యాయన యుత్తమాదర్శముగ నుండును.

దయానందు డిట్లాలోచనా నిమగ్నుడయి కూరుచుండును. ఆ తలంపు లాయన కోమల మానసమున భగ భగ మండుచుండును. ఆయన సహనముతో శాంతముతో నిశ్చిత చిత్తముతో గూరుచుండును. చనిపోయిన ముద్దు చెల్లెలి కొఱకు కాతడు విచారింపడు. అందరాయ నను కఠిన హృదయు డందురు. తన్నంతగా ప్రేమించు ప్రియమాతయు నాతనిది రాతి గుండె యనును. కాని దయానందు డామాటలను పాటిం పడు. ఆయన యేకాలోచనము అమృతత్వమును గూర్చియై యుండును. ఆయన తన హృదయమును ప్రాణమిత్రులకు గాని గూరిమి పితరులకు గాని విప్పి చెప్పడు. ఆయన తలంపులును నిశ్చయములును మూసి ముద్రవేసిన పుస్తకమువలె వారికి దుర్గ్రాహ్యములై యుండును,

మూడేండ్ల వ్యవధి. ఇంతలో మరల నొక మరణరంగము. ఇప్పు డు వ్యాధిగ్రస్తుడైన డాయన పినతండ్రి. ఆయన పండిత మండనుడు. దయానందునియం దధికప్రేమ కలవాడు. ఆయన కిప్పుడు స్మృతి తప్పి పోవుచున్నది. దయానందుని దగ్గఱకు రమ్మని పిలుచును. ఆతని మో మును మోహముతో దిలకించును—అయ్యో ! ఇదియే కడసారి—కడ సారి చూపు ! ఆతని కన్నుల నీరు గ్రమ్మును. దయానందుని కోమల హృదయము మొదలంట చలించును. అది నీరగును. ఆత డేడ్చును. ఆ నీరు ధారలు గట్టును. ఆతని కనులు రక్తారుణములగును. ఆతడు కడసారి మృత్యువును జయించుటకు గృత నిశ్చయు డగును. ఇక నాత డీ విషయమును నెచ్చెలులనుండియు మాతా పితలనుండియు మఱుగు చేయడు. ఆత డిప్పుడు ప్రాజ్ఞులను ముక్తి సాధనముం గూర్చి ప్రశ్నించు చుండును. మృత్యువును నిర్జించు టెట్లని విచారించుచుండును. వా రెల్లరు నేకగ్రీవముగా యోగమార్గమును జూపుదురు.

# తృతీయాధ్యాయము

## యోగాన్వేషణము

"ఏకాగ్రతా తత్త్వమును గూర్చి సంపూర్ణశోధనము జరిగి యుండలేదు. ఒక వస్తువుపై దృష్టినిడి చిరకాలము నిశ్చలముగా నిలుపుట మాత్రమునసే విచిత్ర ఫలితము కలుగుచున్నది. గిబ్బను చెప్పిన అథాసు గిర్యాశ్రమ వాసులగు సన్యాసుల వృత్తాంతమును, వారి ధ్యానాభ్యాసమును పరిహాసింపబడి వట్టివని కొట్టి వేయబడుచున్నవి. కాని యందొక యర్థము కలదు. వారు తమ గుహాద్వారములను బంధించి, పొడుగు గడ్డములను వక్షస్థలమున నానించి హృదయమును ధ్యానము చేయుదురు. ప్రప్రథమమున సర్వము నంధకారముగను కష్టముగను నుండును. కాని నేయింబవళ్ళు శ్రమచేసినచో నీ కత్యంతానందము కలుగును. నిజ హృదయ స్థానమును గన్గొనినతోడనే నీ వొక యవాచ్యమగు స్వర్గీయ ప్రకాశమున నిమగ్నుడ వగుదువు" అని డీ. డబ్లియు హోమ్సు అనుచున్నాడు. బ్రెయిడ్ అను నాయన యేకాగ్రత మూలమున ఇంద్రియజ్ఞాన రాహిత్యమును కలుగుననియు, ఒక రోగి తన దృష్టి నొక వస్తువుపై నిలిపియుంచిన మాత్రమున మత్తుమందుతో నిమిత్తము లేకయే యాతనికి శస్త్రము చేయుట సాధ్యమగుననియు నిరూపించుచున్నాడు. "నేను పరిశీలనా విషయమును మనస్సు నెదుట నిలుపుకొని తొలుత నది మసకగా గన్పట్టినది మొదలు క్రమముగా విడిపోయి ప్రస్ఫుటముగ బ్రకాశించునంతవరకు వేచియుందును." అని న్యూటను చెప్పినట్లు చెప్పుదురు. ఇవి ధ్యానమువలన నెట్టి యుత్కృష్ట సిద్ధి కలుగునో సూచించు భిన్నోదాహరణములు.

ఐరోపా అమెరికా దేశములలో గిబ్బను విరచితమును సుప్రసిద్ధమును నగు అథాసు శిఖర సన్యాసుల కథను పరిహాసము చేయుదురు. వారు వెక్కిరింతురు. ఏల? వారందలి విషయమును గ్రహింప జాలకుండుటయె కాక తామె సర్వజ్ఞులమని విఱ్ఱవీగుదురు కావున వారొక్కసారి తమ యజ్ఞాన గంభీరత్వమును గ్రహింపగల్గినచో నిశ్చేష్టులగుదురు. వారి మనస్సు మరల గూటబడకుండును. వాస్తవమునకు మానవుడెఱింగిన జ్ఞానము ఆతడెఱుంగని దానిలో నెన్నవ యంశము తూగును! వారట్టి ధ్యానాభ్యాసమునకు యోగ్యులు కారు. వారి శక్త్యుత్సాహములు వారిని ప్రాపంచిక జీవిత కష్ట మార్గములను బట్టి పోమ్మని నిర్బంధించుచున్నవి.

హిందూదేశమన్ననో ధ్యానమున కగ్రగణ్యమై వెలయుచున్నది. సమశీతోష్ణస్థితి కలిగి, ఫలపుష్ప సమృద్ధి కలిగి, మధుమక్షికామకరందము కలిగి, గోక్షీరము కలిగి నాగరికతా హస్తము జీవితమును 'పెనగులాట' గా నొనర్పని యే పర్వత శిఖరమునందలి నూత్నగుహా గర్భముననో ప్రశాంతతతో యోగి ప్రార్థనము సలుపుచు జీవింపగలడు. ప్రాచీన కాలమున సామాన్యముగా పండితులును ధర్మనిష్ఠాపరులును భక్తులును పురములను వదలి, విజనములగు వనభూములయందలి యే యేకాంతాశ్రమమందో నివసించుచు, ప్రార్థనాధ్యానములయందు నిమగ్నులయి, విద్యాభ్యర్థులై తమ యండ జేరినవారికి విద్య యొసగుచు, ఝరీతీరముల సంచరించుచు, ఫలకుసుమములను సంతరించుచు, గోగణమును మేపుకొనుచు నానందముగ జీవితయాత్ర సలుపుచుండెడివారు. ఆయానందము నిష్కళంక మని చెప్పజాలము—ప్రవృత్తి కామయ మగు నీ దేహాపవిష్టుడగు నంత కాల మెవ్వడు నిర్మలానందము నాశింపగలడు?—కాని యది కొలది కోరికలతోడను ఉత్తమప్రాప్తులతోడను గూడిన జీవిత మని నిస్సంశయముగా వక్కాణింపగలము.

ఇంకను నున్నతజీవనము గడపిన వారు కొందఱు గలరు. వారు యోగము నభ్యసించుచుండిరి. వారు గంటలకొలది, దినముల తరబడి, మాసముల పర్యంతము శ్వాసమును బంధించి యేకాగ్రచిత్తులై ధ్యానించుచుండిరి. పరిహసింపకుడు పాశ్చాత్యసోదరులారా! ఇది—దినముల కొలది, మాసములకొలది శ్వాసమును నిరోధించి యొక యనిర్వాచ్యానందము ననుభవించుట యను నిది యథార్థము. దాని ననుభవించినది మానవులే—మీవలెనే రక్తమాంసోపేత శరీరులే—కాని మీకంటె భిన్న ప్రజ్ఞా సమన్వితులు. ఈ బ్రహ్మానందానుభూతియందు పెక్కండ్రు మహాత్ములు తాము మృత్యువును నిర్జించితిమనియు జీవితమును జయించితిమనియు పరమేశ్వరుని జేరుదుమనియు సుఖచింతనములతో భూమాతృగర్భమున పూడ్చగోరియు పర్వత కందరముల బంధింపగోరియు నిత్యమున లీనమొందిరి.

శాంతి ముక్తులకై దయానందుడు యోగము నభ్యసింప గోరెను. కాని వివిధ ప్రేమములకును విరుద్ధలాభములకును ఆకరమగు సంసారము యోగాభ్యాసమున కనుకూలముగాదు. కావున నాతడు యోగతత్పరుడైనచో స్వగృహమును—మాతాపితలను—ప్రేమాస్పదమగు సమస్తమును వర్జింపవలసియుండెను. త్యాగము ప్రోన్నతమై యుండెను. ఐనచో దయానందుడును తత్తుల్యుడుగనే యుండెను. పూర్వము చెప్పినట్లు ఆతడు తన యాశయములను దాచియుంచలేడు. కావున నవి శీఘ్రముగనే మాతాపితల కవగతములయ్యెను. వారాశ్చర్యపడిరా? భీతిల్లిరా? అది యెట్లున్నను హిందూజనకుడెన్నడును నట్టు ఖేదమొందడు. సాహసికుడగు నే యువకుడైన సంసారము విడిచి పో జూచినచో నాతని సులభముగా నింట బంధింపగల సాధనమాతని చేతిలో నున్నది. ఆ బంధమునుండి నీవు మఱి తప్పించుకొన జాలవు. పితృశాపమైన నంత చలపాదిరినముతో వెంటాడింపదు. అది నిన్ను శ్మశానము వరకు మాత్రమే కాదు. ఆవలి

జీవితమునను నిశ్చయముగా వెంబడించును. ఏ జనకుడైన తన బాలుని గూర్చి 'ఫలాని వారి పిల్లను నా చిన్నికొమరునకు నిచ్చి పెండ్లిచేయుదును. అని యనుచుండగా నాతడట్టి భయానకములగు పలుకు లాడుటకంటె నా బాలుని చెరలో బంధించుట కాని, చంప నాజ్ఞాపించుట కాని మేలని యెంచుదును. ఏలయనిన ఆ వాక్యముల ఫలితము మృత్యువుకంటెను దూరము పోవును. ఒక పురుషునికి స్వేచ్ఛానుసారముగ గాక పరిణయము చేయుట మానవుని మానవునిపట్ల జేయగల మహా నిరంకుశ కృత్యమును అత్యంతక్రూరచేష్టితమునునై యున్నది. ఇది నిర్దోషిపై పరిమిత కాలము కాక యావజ్జీవమును విధించు కఠినశిక్షణము.

నీవు నీపుత్రుని కొరకు యుపకారము చేయుచుంటివని తలంచెదవు ఆతనికి ముసలికాలమునుండి సంరక్షించు ద్వితీయ గృహమును గూర్చి కృతకృత్యుడవైతివని నీవనుకొందువు. అను రక్తయగు పత్నికంటెను అనుకూలుడగు మామకంటెను గావలసినదేది? పెండ్లిలేని యేకాకికి కష్టములయి పీడాకరములయి నాశనకరములయి యుండు నాపదలనుఆయువకుడు తనప్రియ బాంధవుల సహవాస సహాయముల వలన సులభముగా తరింప గలుగును. అయితే పెండ్లాము ప్రేమింపక మామ మన్నింపక పోయినయెడలనో? కొందఱు పసివాండ్రు పలువురు పసిబిడ్డల కలిగి పోషణమును దుస్తులను సంరక్షణమును గోరినయెడలనో? ఎట్లీచిన్నిబిడ్డల బొజ్జలు నింపుట? ఎట్లు వారిమేనమున్తులు తొడుగుట? ఇట్టిప్రశ్నములెన్నియో మనస్సునుకలంచును. వీనికిపొల్లుమాటలతో గాదు క్రియతో ప్రయాసముతో ప్రత్యుత్తరమీయవలెను.

నీవు శారీరికముగను నైతికముగను పరిణయ బంధమున కర్హుడవగుదువో కాదో యెవ్వరును యోజింపరు. వివాహము సావధానముగా నాలోచించి ప్రవేశించు యావజ్జీవ ధర్మముగా గాక మనమేదియో యొక తీరున నిర్వర్తింపవలసిన వట్టివేడుకవలె తలంపబడుచున్నది.

దయానందు డకస్మాత్తుగా నెట్టి భావనావర్తమున ద్రోయబడెను! ఆనందదాయకమగు యోగాభ్యాస స్వప్నమునుండి వివాహిత జీవనముయొక్క కష్టపరంపరలో నిట్లు త్రోయబడుట నిశ్చయముగా ఖేదము గలిగించును. దయానందుడు భయవిస్మితుడగును. సమాధియు సన్న్యాసమును సర్వము నాతనిచేతినుండి ప్రాయికముగ నిక జారిపోవును. ముక్తికై పరితపించిన యాతని యాత్మ మరల పంజరమున బంధింపబడి యంధకారమున ద్రోయబడుటకు సంసిద్ధముగ నుండును.

అందుచే నాయన కొందఱు సామాన్యస్నేహితులను జేరి పరిణయ ప్రయత్నము నాటంకపరపుడని ప్రార్థించును. విహితుల విజ్ఞాపనములును వ్యర్థములగును. తండ్రి మఱింత కృతనిశ్చయుడగును. ఆతని కింతలో నిరువదవవత్సరము ముగియును. ఆతడు పఠించుచున్న నానాగ్రంథములను సమాప్తముచేసి వైదుష్యసంపాదనమునకై విద్యానిలయమగు వారణాశీ నగరమునకు బంపుడని పితరుల నెంతయో బ్రతిమాలుకొనును. వారాతని యభీష్టమున కనుమతింపరు ముఖ్యముగా తల్లి కొడుకును వద్దని బహుభంగుల ప్రార్థించును. ‘విశేషముగా చదువుకొన్నవారు వివాహమును తృణీకరింతురు’ అని యామె యనుచుండును. ఆతడు నేర్చుకొన్న విద్యలు చాలును- ఇంక నెక్కువతో నిమిత్తములేదు. అతనికి పరిణయ ప్రాయము వచ్చినది. ఇక పెండ్లిచేయవలెను. మఱియొక భూభాగమున ‘ల్యాండరు’ అను నొకప్రఖ్యాత పురుషుని మాత పుత్రున కిట్లుత్తరము వ్రాసెను.

“ప్రపంచమును నీరచనలచే నానందింప జేయవలెనని నీకనులు పాడుచేసుకొనకుము. నీమెదడును బాధింపబోకుము నీయారోగ్యమును గూర్చి తప్పక శ్రద్ధ పుచ్చుకొనుము. అది నీకుటుంబమున కెక్కువ సహాకారిగ నుండును”

దయానందుని ప్రార్థనలన్నియు వ్యర్థములగును. అతడు నిరాకరించినకొలదిని తండ్రికి బింక మెక్కుడగుచుండెను. ఇక మాటలాడుట నిరర్థకమనియు, మీదుమిక్కిలి కార్యమును మఱింత వేగిరించుననియు నాతడు మౌనము ధరించి యేకాంతమును సేవించును. తండ్రి యాతని దృష్టి సంసారము మీదికి మరల్పవలెనని యెంచి దయానందుని జమీందారీ వ్యవహారములు చూచుమని నియోగించును. కాని యాతడు తిరస్కరించును. పిదప సత్వరముగనే తండ్రికోపములు సమాధానపడుదురు. ఇంతటినుండియు నాతడు చేరువగ్రామమునందలి యొకపండితుని చెంగట సంస్కృతము జదువనారంభించెను. హిందూజీవితము యొక్క సాధుభావ మాతనియందు మరల నిండుకొన్నట్లు కొంతకాలమునకు గన్పట్టును. కాని భగవంతుడన్యథా తలంచును. ఒకనాడాకస్మికముగా నింటికి రావలసినదని వర్తమానము వచ్చును. పోవుట కాతనికిష్టముండదు. ఐనను పిలువనంపిన కార్యమేమోయని బహుధా యోజించుచు తన భవితవ్యము గూర్చి చింతించుచు స్వగృహోన్ముఖుడై చనుదెంచును. "పెండ్లి యన్న నాకజేయమగు దృఢవిరాగము" ఇట్లని యాతడు తన గురునితో ప్రస్తావనావశమున ననెను. ఆయన తన నేస్తుడగు దయానందుని జనకునికీ సమాచారము నెఱింగించెను. దానికి శిక్షయనుభవించవలెను. ఆతడు తక్షణమే పెండ్లి యాడవలెను. అజేయమగు వైరాగ్యము! ఆతడు మృత్యువునైన జయింపవచ్చును కాని దానిని ఆబంధమును—మాత్రము జయింప వలను పడదు.

సందిగ్ధసమయమే తెంచును. దయానందుడు దానిని ధైర్యముతో నెదుర్కొనును. ఆయన యందుకు తుల్యుడై సంసిద్ధుడై యుండెను. తన స్వాతంత్ర్యమునకై పోరాడుటకు గృతనిశ్చయుడగును. ఆయన తన విధిని మాత్రమే కాక హిందూదేశ విధిని గూడ నిర్ణయించుననని నుంత

యేని మెఱుగను. అత్యుద్వగ్న చేతస్కులగు పితరుల వలన భారతవర్షము బహుబాధల పాలైనది.

1846 వ సంవత్సరమున నొక సాయంకాలమున (సరియైన తేది తెలియరాదు.) దయానందుడు స్వగృహమును, మాతాపితలను, సోదరులను, స్నేహితులను, బాంధవులను—ఎల్లరను మెల్లగా వీడి పునరాగమనేచ్ఛారహితుడయి సమీరస్వేచ్ఛా విహారముతో సత్యము నన్వేషించుటకును, సత్యము ననుసరించుటకును సత్యమును బోధించుటకును బహిఃప్రపంచమున బయలు వెడలును.

తన్ను పరులు పోల్చుకొనుటకును పట్టువడకుండుటకును మన పడుచుదినమ్మరి సంచార శూన్యములగు మార్గములను బట్టి పోవుచుండును. అవి చుట్టు త్రోవలును దీర్ఘతరములు నైనను పట్టణములకును ప్రసిద్ధమార్గములకును దూరమున నుండును. మూడవ నాడాతడొక గ్రామమున జేరగా నందు మోర్విగ్రామమునుండి యొకపడుచువాడు పారిపోయెననియు, అతని వెదకుచు గొందఱు పాదచారులను అశ్వికులును వెంబడించిరనియు నొకవార్త వినును. ఈ వార్త యాతనిం గూర్చి నదేయని పాఠకులకు చెప్పవలెనా? ఇంటివద్ద నత్యుత్సుకుడగు జనకుడును, అతితరోత్సుకురాలగు జననియు పుత్రునికొఱకేడ్చుచు, ప్రతినిమిషమును నాతని రాకకై నిరీక్షించుచుందురు. కారణమేమొనే నెఱుగను గాని హిందువు డతిసుకుమార హృదయుడై నాడు. స్వల్ప వియోగావసరముల గూడ తల్లిదండ్రులు తగతురు. బిడ్డలు దుఃఖింతురు. అది శాంతదినముల ఫలమా? లేక యసంపూర్ణ శిక్షాఫలితమా? లేక ఈ యుభయము యొక్కయు లబ్ధమా? మూలమేదియైనను, ఈఫలితము మాత్రము నష్టదాయకము. స్వేచ్ఛా బలములు మానవుని జన్మస్వామ్యములు. ఎవ్వడు తద్విరహితుడో యాతనికి మానవజీవితము యొక్క ప్రధానాంశమే లోపించును.

హిందూదేశమున ప్రేమ దయా పరోపకారములం గూర్చి విరి విగా విందుము. అయితే స్వధర్మము వ్యర్థమైనదేనా? ప్రేమము స్వధ ర్మాతిరిక్తమగు పదార్థమా? హిందువులు మరల స్వధర్మభావమునకు— దేవునియెడల, మానవకోటియెడల, స్వకీయాత్మయెడల స్వధర్మభావము నకు రాగల సుదినమునకై కుతూహలపడుచున్నాడను. దయానందుడు తన గృహమును వీడుతఱిని తన యుత్తమ ధర్మమును నెరవేర్చెను.

దయానందుడు శాంతజీవనమును గడపునట్లు విధింపబడలేదు. నాల్గు మాసములు కడచునో లేదో యాతడు తన తండ్రి కట్టెదుట బడును. ఎట్లో యా వృద్ధుడు తన కొమరుడున్న తావును దెలిసికొని సత్వరముగ నాతని స్వగృహమునకు గొంపోవ నిశ్చయించుకొను. ఆతని జూచినంతనే దయానందునికి కంపము జనించును. ఆతడు నిర్విణ్ణుడగును. ఆతనికి నోట మాట రాదు. కాని తండ్రి యత్యుగ్రుడై యాతని పరి పరివిధముల పరుషముగా నిందించును. ఆతడా యావన బ్రహ్మచారి యొక్క కాషాయ వస్త్రములను చించివైచును. కుల దూషకుడనియు, వంశమునకు సిగ్గుచేటనియు, ద్రోహియనియు నాతని నెన్నియో విధ ముల తూలనాడును. కులమునకు దూషకుడును సిగ్గుచేటును! అయ్యో! బ్రాహ్మణుడా! నీ తనయుని భావి విధి నించుక జూపగల నేత్రములు నీ కుండ వలసినది! దయానందుడు తండ్రి పాదములపై బడి తన్ను మన్నింప గోరి యయిష్టముతో గృహమున కేగ మరలి వచ్చెద ననెను. తండ్రి తన యనుచరులగు నలుగురు సేవకుల కాతని బంధితునిగా నప్ప గించెను. ఓ స్వేచ్ఛాదేవతా! నీ యభిలాషి యిప్పుడు భోజన, జీర్ణ, శిలార్చనా విధులకంటె నుత్తమ కర్తవ్యము నెఱుగని మూర్ఖ కఠిన చేత స్కుడగు జనకుని చేతిలో బందీయైనాడు. అతడు గోత్రపిల్లవలె పెనగు లాడక ప్రయత్నము సలుపక యూరక యడుచుచుండవలసినదేనా? కాదు. తుపానులను పరిహసించి గర్జించుచు సంక్షుభిత సాగరములను

సంతరింప జాలిన మహాశక్తి యిట్లు హీనముగా నణగి మణగి హతము కానేరదు. ధీరహృదయమా! ధైర్యము. ఇంతకంటె మానవుడు ప్రద ర్శింప దగిన యుత్తమశక్తి లేదు. దుర్జేయమగు నాత్మ!—ఓ పురుషుడా! 'తత్త్వమసి' నీవు దాని కావంతయు దీపిపోవు. ప్రకృతి విపుల తరముగను మహత్తరముగను నుండవచ్చును. కాని యది నీకంటె శక్తిమంతముకాదు. నీవు ప్రభువు. ప్రకృతి నీ బంటు మాత్రమే. ఓ యాత్మా! నీ ప్రభుత్వ మట్టిది. వట్టి మట్టిని గూర్చి మేము చెప్పుట లేదు.

దయానందుడు పలాయన మగుటకు నిశ్చయించుకొని యర్ధరాత్రి మున కాపరులు సుప్తివశులై యుండగా కాలికొలది పరుగెత్తును. ప్రాణ రక్షణార్థమువలె నాత డెంతయో దూరము పారిపోవును. కాని తెల్లవా రుట తోడనే యొక చో నొక దేవాలయమున గుబురుగా బెరిగిన యొక వృక్షము నెక్కి తత్ శాఖా నికుంజము మఱుగున గూరుచుండును. మను ష్యులు వచ్చి యా దేవాలయము యొక్క బహిరంతరముల వెదకి యా తనిం గానక వెడలి పోవుదురు. పగలు గడచిన వెనుక చీకటి మఱుగున నాతడు మెల్లగా నా శాఖా కుటీరమునుండి దిగును. ఆత డన్నము లేక శుష్కించి యలసి సొలసి యుండును. కాని గండ్రకత్తెర వంటి పెండ్లి బాధ తప్పెను గదా యని హర్షోత్సాహ పూరితుడై యుండును.

ఎవ్వని యాత్మ బలమైనదో వానిని దేహబాధలు గాని లౌకిక కష్టములు గాని యేమియు చేయజాలవు. ఉన్నతాత్మ లేనివాడెవ్వడును ఎట్టి ఘనకార్యమును నిర్వర్తించి యుండ లేదు.

గణనదిన మేతెంచునప్పు డీశ్వరు డెవ్వని నెన్నుకొనునని మీ రూహించుచున్నారు ? పరులకొఱకు గాని సత్యము కొఱకు గాని యెవ్వ రెక్కువ కష్టము లనుభవించిరో వారినే సుడీ !

దయానందుడు తన జీవితముయొక్క ప్రథమాధ్యాయమును ముగించును. ఆయన సంసారమును, సంసారిక జీవితము యొక్క మధుర

దుఃఖమును విసర్జించును. ఎట్టి కఠిన ప్రియాశ్నములు ! ఇవి యన్నియు నెందులకు గృహమునుండి, పరిణయమునుండి, సంసార సౌఖ్యముల నుండి దూరముగ పారిపోవుటకు, సామాన్యముగా సాటి యువకు లెల్ల రును ప్రపంచమున ప్రవేశించి యందలి సౌఖ్యముల ననుభవించుట కాస క్తులై యున్న తఱిని ఈ ప్రకృతి బిడ్డను—ఈదేవదూత సంసార, సౌఖ్య ముల నెల్ల పరివర్జించి మహామారినుండి వలె ప్రపంచమునుండి విదూర ముగా, నొంటరిగా, దిక్కుమాలి, భావి విచారణ లేక, యడవుల వెంబ డిని, శైలోపరిని, నర్మదానుండి హిమాలయము పర్యంతము, నిత్య జీవన ముం గూర్చి తన కుపదేశింపగల యోగి పుంగవులను మహాత్ములను అన్వేషించుటకై పదు నాలుగు వర్షముల దీర్ఘకాల మేకరీతిని సంచరించు టకు సంసారము నుండి పారిపోవుచున్నాడు.

'ప్రపంచము మన యంతరముననే కాని వెలుపల లేదు. దానిని మన యిచ్ఛ వచ్చినట్లు త్రిప్పవచ్చును' అను వాక్య మెంతయు సార్థ కము.

ఆయన యిల్లు విడిచిన పిదప రెండేండ్లలో దయానంద సరస్వతి యను నామముతో సన్యాసమును స్వీకరించెను. ఆయన పూర్వనామ మెద్దియో మన మెఱుగము. ఆయన విషయమై విచారణ చేసిన కీర్తి శేషుడగు లేఖారామ పండితు డది మూలశంకరు డని చెప్పుచున్నాడు.

ఆయన కిప్పు డిరువది నాలుగేండ్లు. ఈశ్వరుడే సర్వమును; సర్వ మును ఈశ్వరుడే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ.' 'ఏక మే వాద్వితీయం బ్రహ్మ.' అను నద్వైత సూత్రములను విశ్వసించుచు, అద్వైత గ్రంథములను బఠించుచు, అద్వైతవాదులతో నాయన సహవాసము చేయు చుండెను.

అనంతరజీవితమున స్వబుద్ధి వికసించిన పిదప నాయన యద్వైత వాదమునకు ప్రబల శత్రువై యుండెను. ఇయ్యది పరివర్తనము కాని

యసంగతము కాని కానేరదు. అది వ్యాప్తి, అభివృద్ధి. దయానందుని మానసము వ్యాపనాశీలమైనది. అది మహాత్ముల మానసము లనేకముల వలెనే చిరపరివర్ధమానముగ నుండెను.

ఆయన చతుర్దశవర్షముల దీర్ఘకాలము యోగమే తన జీవిత పరమార్థముగ నెంచి తదర్థమై యవిరామముగ కృషిచేసెను. వన్యస్థలుల యందును శైలగహ్వరములందును సహస్రవర్షపాయులగు యోగీంద్రులు తమ సిరస్సులపై పచ్చిక మొలవగా ధ్యాన నిమగ్నులయి యుందురని యాయన కొక పరిబలవిశ్వాస ముండుటచే నాయన సంచారములకు మేర లేకుండెను. ఒకప్పుడు దుర్గమమగు గహనమధ్యమున దిరుగాడుచుండును. మఱియొకప్పు డున్నతమహీధరి శిఖరముల నధిరోహించును. ఏ తావున యోగీంద్రులుందురని యాయనకు దెలియవచ్చునో యాపరిదేశముల కెల్ల నెట్టిసంకటములనైన లెక్క సేయక చనుచుండును. ఈయన్వేషణమున నాయన పెక్కుమంది యోగులను (వారు, ఆయనవిన్నంతయు తలంచినంతయు మహాత్ములు కాకుండి రనుకొందును.) సందర్శించి వారినుండి యనేక యోగ రహస్యములను సంగ్రహింపగల్గెను. జ్వాలానందపురి శివానందగిరి యను నిరువురు మహాత్ములు తనకమిత సాహాయ్యమును జేసినట్లును, విశేషాంశములను బోధించినట్లును మనకాయన తెలిపియున్నాడు. కాని యింకను మహానుభావుల నాయన ఆబూశిఖరమున గాంచగల్గెను. కొంచెము కొంచెముగా నీదీర్ఘాన్వేషణములో నాయన యోగవిద్యయం దనల్ప ప్రావీణ్యమును సంపాదించెను. ఆయన సమాధి గంటలకొలది పట్టుచుండెనని చెప్పుదురు. ఈయటవీధ్యానములును పర్వతయోగములును వ్యర్థము కాలేదు. దయానందుడు వనుల దిరుగుచు గిరుల నెక్కుచు యోగాభ్యాసమున కాలమెట్లు గడపెనో భావనాశక్తి మనకు లీలగా మాత్రము గోచరింపజేయగలదు. ఆయన యాత్మ యంతగా పరితపించిన స్వాతంత్ర్య మిచ్చట లభించెననియు, ఆయన యిచ్చట

హాయిగా వేళల వెళ్లబుచ్చుచుండెననియు, మీరనుకొందురు. లేదు. లేదు ఆయన సమగ్రముగా కర్మఠుడు. ఆయన క్రియాశూరుడును. వాక్ఛూరుడును. కాని యింతవరకు నాయన స్వసామర్థ్యమును స్వకార్యమును దెలిసికొనలేక పోయెను. దిన దినము నాయన శక్తి నార్జించుచుండెను. కాని దాని నెచ్చట వెచ్చము చేయవలెనో, తన నిర్దిష్టకార్యమెద్దియో, పర హస్తము కాక స్వయముగ దానే నిర్వహింపవలసిన యుత్తమ కర్తవ్య మెద్దియో యాయన యించుకయు గ్రహింపజాలకుండెను. ఆయన యోగమును బాగుగా నభ్యసించెను. కాని యాయనకు మనశ్శాంతి చేకూరలేదు. ఆయనకు సంతృప్తి కలుగలేదు. ఆయన యధికశ్రాంతుడై యుండెను. ఒకప్పుడు ద్రోణ సాగరము వద్ద నుండగా నాయన యాత్మహత్య చేసికొన నెంచెను. మనుజుడు తన యుక్తకార్యమును గుర్తెఱుగ జాలనప్పు డది మృత్యువుకంటె వేదనాకరముగ నుండెను.

# చతుర్థాధ్యాయము

## గురుచరణసన్నిధి

దయానందుడు పితృభవనము వీడి వైరాగ్యము బూని పదునాలు గేండ్లు గడచెను. ఈ కాలమంతయు నుచ్చతర జీవనము కొఱకు సంతత పరిశ్రమ, ప్రయత్నములతో నిండి యుండెను. కాని యాయన తన కర్తవ్యమును నిర్దిష్ట కార్యమును గ్రహింప జాలకుండెను. ఆయన వన శైల వాతావరణమును వీడి నగరమార్గమును మరల బట్టును. మధురలో మహా విద్వాంసుడగు నొక సన్యాసి కలడని విని తత్పవిత్ర పురమునకుం జనుదెంచును. 1860 నవంబరు 14 తేదీని యమ ద్వితీయదినమున అనగా దీపావళి పండుగ తరువాత రెండవనాడా పట్టణమున బ్రవేశించి తిన్నగా నా సన్యాసి పండితుని గృహమున కరుదెంచును.

ఈయన సాధారణ పండితుడును సామాన్య మనుష్యుడును గాడు. ఆబాల్యాంధుడు. వృద్ధుడు విశీర్ణాంగుడు. డెబ్బది సంవత్సరములు జీవితయాత్ర సలిపినవాడు. వివేచనాశక్తియుక్తుడు. విశాల మేధాసంపన్నుడు. దృఢ సత్య హృదయుడు. ఆయనకు మీ మాయలును మూఢ విశ్వాసములును మీ పవిత్రాసత్యములును సమ్మాన్యాస్పృతములును లేవు. ఆయన ఆర్ష గ్రంథములను దప్ప యన్యమును బోధింపడు. తక్కిన వానిం గూర్చి యొక్కటే మాట చెప్పును: 'యమునానదిలో బడవేయుము!' దయానందు డాయన దగ్గఱ కఱిగినప్పుడు అజ్ఞానావృత పూరితములగు గ్రంథములను గౌరవముగా పాతి పెట్టుమని యానతిచ్చెను. "అవి పైశాచిక గ్రంథములు. సత్యాన్వేషిచే పఠింపబడుటకంటె తలాడిచే తగులబెట్టబడుట కెంతయు నర్హములు." అని యా పవిత్ర పురుషుడు పలుకును. దయానందు డొక్కక్షణ మాలో

చించి యా యాసతిని నెరవేర్చును.

కాని నిరాధారుడగు మనవిద్యార్థికిఆర్ష గ్రంథములను గొనుటకును ఉదరపోషణ మొనర్చుకొనుటకును తగిన సాధనము లేకుండును. సాహాయ్యము దైవికముగా వచ్చును. అదిసర్వసాధారణముగా నట్లేవచ్చును. ప్రకృతి దాని కొఱ కేర్పాటుచేసియున్నది. ప్రకృతి ప్రతిమానవహృదయము నందును పరోపకారమును నాటియున్నది. దానిని మేల్కొలుపుకెట్లో నీ వెఱుంగనిచో అది నీ దోషమేయగును. ఎట్లయినను నీ వెవరి సాహాయ్యము నపేక్షించి విఫల మనోరథుడ వగుదువో వారి యందుకంటె నీయందే యా దోష మధికముగ నుండును. యోగ్యత కనిపెట్టి యయాచితముగను అడిగిన తృణము నను సహాయమొసగువారు కొందఱు న్నారనుట వాస్తవము. వారు మన మహాపురుషులలో రెండవతరగతివారు. అట్టివారు స్వల్పసంఖ్యాకులు మాత్రమే కలరు. వారు మానవకోటి కృతజ్ఞత కెంతయును పాత్రులు. ఒక సత్పురుషు డాయనకు భోజనము పెట్టుట కంగీకరించును. మఱియొక ధర్మాత్ము డర్ధరాత్రమున జదువుకొనుటకై చము రిచ్చును. మఱికొందఱు పుణ్యశీలురు పుస్తకములను గొని యిత్తురు. ఇట్లు సేకరించుకొని దయానందుడు తన యుత్తమ గురు చరణ సన్నిధిని గూరుచుండును.

కాని విరజానందుడు తీక్ష్ణ స్వభావుడును కోపశీలుడును నగు నాచార్యుడు. ప్రాయికముగ దీర్ఘ కష్ట మాయన నట్లొనర్చి యుండెను. అతిసార వ్యాధిచే చిరబాధితుడు, అంధుడు, వృద్ధుడు, జీర్ణాంగుడు. ఇంతకంటె కష్ట మెద్దికలదు ? మఱియొక విషయము కూడ మనము జ్ఞప్తియందుంచుకొనదగియున్నది : ప్రకృతి యత్యంతోదారవంతురాలు కాదు. ప్రాయికముగ మానవుని విధి యాపె నట్లుండ నంగీకరింపదు. ఆమె యొక విషయమున సౌదార్యము చూపించిన మఱియొక విషయమున కటికతన మగపరచును. విరజానందు డుత్తమ ప్రతిభతోడను

ప్రిస్ఫుట వివేచనముతోడను నలంకృతుడయ్యె గావున తీవ్రమగు మనో నైశిత్యమును అత్యంత తాగ్రహ స్వభావమును గలిగి యుండ వలసి వచ్చెను.

దయానందుని శిరిత్రకంటె సమృద్ధముగను సుందరముగను ప్రకృతిచే సత్కరింపబడు వెంతయు నదృష్టము. దృఢ శరీరమును, విశాల బాహువులను, మాంసల వక్షమును, ఆరగుగుల పొడవును, ఆత్మ నియంత్రిత స్వభావమును, మినుకు మినుకు మని ప్రకాశించు నేత్ర యుగ్మమును, ప్రజాకర్షకమగు స్వరూపమును, ఉత్కృష్ట బుద్ధి వైదగ్ధ్యమును- అస దృశ వాక్పటుత్వమును ఆయన నలంకరించి యుండెను. ఈ విశేష గుణములు లేకున్నచో నిష్కారణ దూషణముతో తృప్తి నొందక దండము నుపయోగించుటకును, వీధిలోనికి త్రోసి ద్వారము బంధించుటకును గూడ నుంతయేని సంకోచింపని యా గురువు నొద్ద నాయన చిరకాలము గడప జాలకుండును. ఇంతియెగాక యాయన గురువునకు నీళ్లు జేరవేయుట మున్నగు చాకిరీ చాల చేయవలసి యుండెను. యమునానుండి దినమున కారు బిందెలకు దక్కువకాక నీరు తేవలసి యుండెనట. పై నుడివిన దండనము మాట వట్టి కథ కాదు. ఆవృద్ధసన్యాసి యొకప్పుడు దానిని ప్రయోగించుటచే చేతి మణికట్టుపై శాశ్వతచిహ్నమొండేర్పడి యుండెను. కాని ఓ మధుర కృతజ్ఞతా ! ఉపకారియొక్క శౌర్యముపట్ల—ముఖ్యముగా నుత్తమాచార్యుని వంటి యుపకారి శౌర్యముపట్ల నెట్టి గౌరవమును, అనురాగమును సృజించుచుంటివి ! దయానందు డా మచ్చను జూచినపు డెల్ల 'నేను నా గురువున కెట్లు ఋణపడి యుంటిని !' అని యను చుండును.

హిందూదేశములో గురుశిష్యులకు గల సంబంధము దృఢస్వభావము గలది. కలిగియుండవలసినది యనియనవలెను. ఏలయిన నది యిప్పుడు శూన్యమైనది. గురువు దైవమువలె పూజింపబడుచు జనకునివలె ప్రేమిం

పబడును. శిష్యునికొకయున్నతోదాహరణముగ మార్గదర్శిగ నుండెను. కులాలుడు కుండలకువలెనే యాచార్యుడు శిష్యుని శీలమున కాకారమొసగి పొంకముదీర్చి యాతనిజీవితము నుత్తమముగా నిరూపించు చుండెను. ఇప్పుడట్టి స్థితిలేదు. పగటి పాఠశాలలును ఉపన్యాస మందిరములును ఆస్థితిని తుడిచిపెట్టెను. ఉపాధ్యాయు డుపన్యసించును. విద్యార్థి వ్రాసి కొనును. వారిసంబంధ మంతటితోసరి.

ప్రస్తుత పరిస్థితులను నిందించి పూర్వమును గొనియాడుట సర్వ సామాన్యమై యున్నది. అదివట్టి యనాలోచితము. నాకాపాట పాడుట కిప్పుడును, ఎప్పుడును నభిలాషలేదు. నీతి, మర్యాద, సత్యము ఈవిష యములందక్క యితరాంశములయందు మన ప్రాచీనులకంటె నవీనులే మిక్కిలి యధికులని నాయాశయము పై నుడివిన గుణత్రయమును దాదాపుగ నంతరించినవి. ఇరువది శతాబ్దముల క్రిందట హిందూదేశ వాసులను గూర్చి మెగాస్థనీసు వ్రాసిన యంశములను నేటి హిందూజన సంఘ స్థితితో బోల్చిచూతుము. హైందవులు తలుపులకు తాళములు వేసి యెఱుగరనియు చౌర్యము, డంబము, మోసము ఎచ్చటను గానరా వనియు, ఆవిరియంత్రమువలెను తంతివార్తవలెను అసత్యమింకను నవత రించి తన యావశ్యకతను స్థాపించుకొన వలసియుండె ననియు ఆతని వ్రాతలవలన మనకు దెలియును. ఆతడు హిందూజన మధ్యమున జాల కాలము మసలియుండెను. కావున ఆతని వాక్యములు విశ్వసనీయము లనుటకు సంశయములేదు.

మర్యాద నశించినది. ఎవరియాజ్ఞచొప్పున ? ఎవనిదోషమువలన దోషమెచ్చట నున్నదియు మనము నిర్ధరింపజాలనపుడు “ అదిభగవదిచ్ఛా ప్రకృతి విధానము ” అని యందుము.

నాగరకతవలన ప్రజాసంఘముయొక్క నైతికవృత్తము పాడువడి నదా ? జె. యస్. మిల్లు గారి యభిప్రాయమున: నాగరకత వాస్తవ

ముగా మంచిది. కాని నాగరకత యవరోధించు నుత్తమోత్తమ ధర్మములును గొన్నిగలవు.

మధురానగరమున దయానందుడు రెండేండ్లు యావన్మానము లుండి ప్రాచీనసంస్కృత వాఙ్మయమును కూలంకషముగ—అనగా వృద్ధాంధస్వామి నేర్పగలుగున దెల్ల నభ్యసించెను. విరజానందుడు నిరుపమాన పరిజ్ఞాన వైదుష్యములు గల పండితుడు ఎవరు వివేచనాదృష్టియు గంభీరాలోచనమును గలిగియు నప్రతిమ ప్రతిభాశాలురో, ఎవరుతమో విదూరులో రహస్య శూన్యులో, ఎవరికి సర్వమును విస్పష్టముగను కాంతిమంతముగను సుందరముగను గన్పట్టునో, ఎవరిసూక్ష్మబుద్ధి ముందర నతిక్లిష్టసమస్యలును సులభముగా విడిపోవునో, ఎవరు ప్రకృతితో నను షంగము కలిగియుందురో, ఎవరు పరమాత్మతో సంసర్గము నను భవించుదురో, ఎవరిహృదయములు శంకారహితములో, ఎవరి యంతరాత్మల ననిశ్చయము పీడింపదో, యట్టిమహాత్ములలో నాయన యొక్కడు పరమేశ్వరుని హితకారిత్వమునందును తమ భావికాలముయొక్క యుత్కృష్టతయందును నిశ్చల విశ్వాసము కలిగియుండి సంపూర్ణ మానసము తోడను వికసిత వదనముతోడను తమకును తమ సృష్టికర్తకును సంతుష్టికరముగ జీవిత సమస్యను పరిష్కరించుటకు దృఢ నిశ్చయముతో వారు రంగమున బ్రవేశింతురు. ఆత్మయుపాధి రహితముగ నుండజాలదని సంశయవాదులు చెప్పునట్లు (అట్టేల యుండజాలదో నేనూహింప జాలకున్నాను.) మనము భావిస్థితిని నమ్మినను నమ్మకపోయినను జీవాత్మయు పరమాత్మయు నట్లు ఉపాధిశూన్యముగ నుండగల్గినచో—ఉండినచో, పూత సత్యజీవనము జడ ప్రపంచ విముక్త జీవనము, సత్యాన్వేషణము నందును సత్యోపదేశమునందును తత్త్వగ్రహణమునందును తత్త్వబోధనమునందును గడచిన జీవనము ఈప్రపంచమున సాధ్యమగు నుత్తమ జీవనమనుటకును మనమోక్షమున కేక సాధనమనుటకును సందియము

లేదు. ఈమనోనిశ్చయముతో మన మహాపురుషు లీలోకయాత్ర సలిపి తమ విస్ఫుట చరణ చిహ్నములను విడిచి వెడలిపోయిరి. మన విరజానందుడీతత్త్వము యొక్క జీవదుదాహరణము. పసితనముననే యంధుడయి తల్లిదండ్రులు లేని దీనుడయి, తోడనే క్రూరురాలగు భార్య ప్రోత్సాహముచే తనసోదరు డింటనుండి వెడలగొట్టగా దాదాపు పండ్రెండేండ్ల చిన్న వయస్సుననే బిచ్చమెత్తుకొని జీవింపవలసియుండెను. అయితే ఆయన తన భుజముపై నిజమగు శిరస్సును తన వక్షముక్రింద నిజమగు హృదయమును గలిగియుండెను. ఆయన తిరిపమెత్తుకొనుచు దిరుగుటకు గాక స్వశక్తి కొలదిని స్వకార్యమును నిర్వహించుటకును స్వధర్మమును నిర్వర్తించుటకును జీవించెను. ఆయన యెచ్చట నేగురువుల వద్ద నధ్యయనముచేసెనో మన మెఱుగము. కాని యాయనకు గల బహుళసంస్కృత జ్ఞానమును సంపాదించుటకు పాపము! చూపు లేని యీదీనబాలకు డెట్టి కష్టముల ననుభవింపవలసియుండెనో చదువరులూహించుకొనగలరు. ఆయన జ్ఞాపకశక్తి యెంత యద్భుతమై యుండవలెనో! ఆయన యంత్యకాలము వరకును పుస్తకాపేక్షలేక తన స్మృతి సాహాయ్యముననే ప్రతి విషయమును బోధించుచుండెను. అంతటి విమర్శనా సామర్థ్యము కల దయానందుని కట్టి యుద్గ్రంథములగు వేదములను బోధింపజాలియుండుటే యాయన యసాధారణ ప్రజ్ఞను వేనోళ్ళ చాటుచున్నది. విగ్రహార్చన మాయన మతము కాదు. దానినాయన బహిరంగముగా ఖండించును. పురాణములన్న నాయన కసహ్యము. సారస్వత, సిద్ధాంతకౌముది గ్రంథకారులన్న నాయనకు మిక్కిలి చిరాకు. ఆయన వద్ద చదువుకొనుటకు వచ్చిన నూతన విద్యార్థులను ఆగ్రంథకర్త నామమును నేలమీదవ్రాసి తమ పాదరక్షలతో దానిపై గొట్టుమని యాజ్ఞాపించును. అట్లు చేసిననే కాని వారిని శిష్యులుగా పరిగ్రహింపడు. దేవాలయము దేవుని నివాసమున కర్హము కావలెనన్న ముందుగా నందుండు

దయ్యమును వెడల గొట్టవలెను. ఆయన యట్టి తీక్ష్ణస్వభావుడును కఠిను డును. న్యాయమార్గమునుండి యాయన నెద్దియు తప్పించ జాలదు. ఒకప్పు డాయన సంస్కృతము బోధించుటకై యొక రాజుచే బ్రార్థింప బడెనట. ఒక్క నాడేనియు నామహారాజు పాఠము మానకుండునట్లును, అట్లు మానినచో తత్క్షణమే యాస్వామి వెడలి పోవునట్లును నిబంధనము చేసికొని యాయన యొడంబడెను. రెండేండ్లవరకు నాతేడు ప్రతి దినము నక్లే పచ్చుచు చదువుచుండెను. కాని యంతలో నొక భంగము కలి గెను. ఆయేలిక యానాడేల రాజాలకుండెనో మనకు దెలియదు. కాని యా రాజు మఱునాడు వచ్చు సరికి స్వామి లేకుండెను.

దయానందుడు విరజానందునివద్ద గడపిన రెండున్నర వత్సరము లును ముగియవచ్చెను. ఆతడింక చదువు చాలించి సెలవు గైకొనుటకు సంసిద్ధుడై యుండెను. ఇంతలో నొకనాడు విరజానందు డాతని నిల్లు తుడుపుమనెను. ఆతడట్లు చేయుచు.కాని యా తుడిచిన చెత్త నచ్చటనే యొకమూల ప్రోవుగా నుంచెను పాపము వృద్ధవిరజానందుడు కనులు గానరామిచే తడవుకొనుచు వచ్చి యాప్రోవుపై కాలువైచి జారి క్రింద పడెను. వాడుక చొప్పున నాయనకు పిచ్చికోపము వచ్చి దయానందుని నిందించి యింటినుండి యావలకు గెంటి తలుపువేయును. దయానందునికి మిక్కిలి పరితాపముగా నుండెను. ఆయన యింక సెలవు తీసికొని గురు కృపను తానెట్లు తీర్చుకొనగల్గుదునా యనివిచారించుచుండగా ఈవిషమ వృత్తాంతము జరుగును. ఈస్థితిలో తన గురువు వద్దనుండి వెడలిపోయి నచో జీవితము పాడుగున నాయనకు దుఃఖముగ నుండెను. ఈ దుస్థి తిలో నాయన కొందఱు స్నేహితులవద్దకేగి మొఱపెట్టుకొనెను. వారా వృద్ధుని వేడుకొందురు. ఆయన మరల శాంతమూని—సజ్జనులకు కో పము క్షణమాత్రమేకదా!—దయానందుడు శిష్యధర్మము కొనసర్ప నంగీక రించెను. తరువాత కొలది నాళ్ళకే యధ్యయనము ముగియును, దయా

నందు డింకు పర్యంతమును సాధనములను సమకూర్చుచుండెను. ఇక తన మనోగతాభిప్రాయములను తన సమార్జిత జ్ఞానమును ప్రచురము చేయుటకు ప్రపంచములోనికి నిర్గమించును. తుదకొక నిర్ణీతదినమున గురుశిష్యులు వీడిపోవుటకై కలసికొందురు. స్నేహితులందఱును సమావేశమగుదురు. ఆరంగము నిజముగా దర్శనీయమై యుండును! దయానందుడు ఉపాయనముగా నొక లవంగపాత్రనందిచ్చును. ఆ యాచార్యవర్యుడు దానిని సంతృప్తితో సంతోషముతో నంగీకరించును. ఆయన దయానందుని దీవించి గురుదక్షిణ యడుగును. "తండ్రీ! ఆజ్ఞాపింపుడు. సిద్ధముగానున్నాడను."అని భక్తివినయములుప్పొంగిపొరలగా సంభ్రమముతో బలుకును. విరజానందుడు వివశుడై అవును, వివశుడై యుత్సాహముతో దయానందుని మానవకోటి క్షేమమునకై పనిచేయుమనియు, సత్యమగు వైదిక ధర్మము వ్యాపింప జేయుమనియు దుర్మత, అజ్ఞాన మూఢ విశ్వాసముల యంధకారమును బారద్రోలుమనియు నాజ్ఞాపించును. ఓ! సుదృగ్వరా! ఓయున్మీలిత నేత్రయుగళా! ఓపండితకుంజరా! నీవంధుడవని యెవ్వరందురు? వారిని జూచి నేను జాలినొందుదును. నీవొనర్చిన యీ యనేక కార్యములకై మా నిత్య సత్య సంపూర్ణ విశ్వాసమునకు పాత్రుడవై వెలయుచున్నావు. యుక్త సహాయమున యుక్త సాధనముతో యుక్త కార్యమును నిర్వర్తించుట ఆహా! ఎట్టి సాకల్యాచరణము! నీ నామము నిత్యమును సంస్మరింపబడునుగాక! ప్రేమింపబడునుగాక! ఓమ్! ఇది 1863 వ సంవత్సరము ఏప్రిలు మాసమున జరిగెను.

## పంచమాధ్యాయము.

### రంగప్రవేశము

దయానందు డనంతరము నాలుగేండ్ల వరకును ఆగ్రా, గ్వాలియరు, జయపురము, పుష్కరము, అజ్మీరు, హరిద్వారము మున్నగు స్థలములను సందర్శించుచుండెను. ఆగ్రాలో నాయన రెండు సంవత్సరము లుండెను. ఆయన యాకాలమున కృష్ణభాగవతమును ఖండించుచుండెననియు, మహాభారతమునుండి కొన్ని భాగములను పఠించుచు బోధించుచుండెననియు తెలియుచున్నది. ఆయన యొకసారి 'పంచదశి'ని ఇది తరుచుగా సన్యాసులు చదువుచుండు గ్రంథము—చదివి తాత్పర్యము బోధించుటకై కొందఱు ప్రార్థింపగా దానిం గైకొని బోధింప దొడగెను. కాని యందొక వాక్యములో పరమేశ్వరుడు భ్రమాధీను డనియుండెను. దయానందు డప్పుడు "ఇది యెట్లు పొసగును? ఈశ్వరు డెన్నడేని భ్రమావశుడగునా? ఇది యార్షగ్రంథము కాదు. నాకది చదువుట కిష్టములేదు. నే నిక చదువను" అని కథ కట్టిపెట్టి యాపుస్తకమును నేలపై బెట్టెను. దానిని మరల నెన్నడును ముట్టలేదు. సుందరలాల్ అను నతనికి ఘ్రాణేంద్రియము మొద్దువోయి వాసనాభేదములను గ్రహింపజాలకుండెను. అతనికి దయానందుడు నీతిధోతి, న్యాలికిత్రియ యను రెండు సాధనముల నుపదేశించెను. వాని నభ్యసించి యాతడు తన లోపమును నివారణచేసికొనెను. ఆయన యీక్రియలను వింధ్యాచలమున నర్మదాతీరమందొక యోగివద్దనుండి గ్రహించెను. వీనియభ్యాసమునకు విస్తారము కాలము నీటియందు గూరుచుండవలసియుండెను.

కావున నాయన తలుచుగా శైత్యమునకు లోనగుచుండెను. దానిని పోగొట్టుకొనుటకై యిప్పుడు (అభ్రికకుష్ట)ను సేవించుచుండెను. ఆయన విగ్రహారాధనమును వైష్ణవమును ఖండించుచుండెను. అయినను రుద్రాక్ష మాలికను భస్మమును ధరించుచు యోగాభ్యాసము చేయుచుండెను.

తరువాత రెండేండ్లు గ్వాలియరు, జయపురము, పుష్కరము, అజ్మీరు నగరములలో గడపెను. అజ్మీరులో నుండగా కొందరు స్త్రీలాయన బోధనమును వినవచ్చిరి. ఆయన వారితో దానెన్నడును స్త్రీలు తన యెదుట నుండుట కంగీకరించుట లేదనియు, వారు తమ భర్తలను తన యుపన్యాసములు వినుటకై పంపి వారి వద్ద జ్ఞానోపదేశము పొందవలె ననియు జెప్పి పంపెను. ఓ స్వామీ! నీ జనని యన్నట్లు నీవు పాషాణ హృదయుడవు. కాని నీవన్నది యెంత యధార్థము!

ప్రతి హిందూపుత్రుడును హారిద్వారమున జరుగు కుంభోత్సవమునుగూర్చి వినియుండును. అదిపండ్రెండేండ్లకొకమారుకూడుచుండును. చిరవిశాల యశో విరాజితమగు గంగాప్రవంతియందు తమకలుషములను కడిగివేసికొనుటకై దేశముయొక్క నలుచెరగులనుండియు జనులు తండోపతండములుగా వచ్చుట జేరుచుందురు. ఎంతవింతయూహా! ఇంతకంటె మాహాత్మ్యముండగలదా? కాని ఓ జ్ఞానవంతుడా! మనస్సును మారిపోనీయకుము నీశక్తిని గూర్చి బిట్టుయోజింపకుము. నీసద్భాగ్యమునకై యీశ్వరుని వందింపుము. ఆతనియెడ విశ్వాసముంచి విధేయుడవై మెలగుము. మందబుద్ధులను అజ్ఞానాంధులను తృణీకరింపకుము. వారును పరమేశ్వరుని సంతానమే—కాని యల్పతరాదృష్టవంతులు. వారిపై దూషణముల గుప్పకుము. అంతకంటె నీస్వధర్మమును నిర్వర్తింపుము—వారి కౌన్నత్యమునకు గొనిపోవుటకు ప్రయత్నింపుము.

లాలా లజపతిరాయిగారు తాము రచించిన శ్రీ స్వామి వారి జీవితచారిత్రమున క్రీ. శ. 7. వ శతాబ్దములో హిందూదేశమును సంద

ర్శించిన చీనాదేశీయుడగు 'హ్యూన్ ఛాంగ్' హరిద్వారమున జరుగు కుంభమేళమును గూర్చి వ్రాసియున్నాడని తెలుపుచున్నారు. ఓ మూఢ విశ్వాసమా! నీవును మానవజాతివలెనే ప్రాచీనురాలవు. మేము నీ యుయ్యెలయందే పెరిగితిమి. నిన్ను కేవలము పారద్రోలుట కెవ్వ రాశింపగలరు? మేము నిరాశిల్లుచున్నారము. ఈ మా విచిత్ర ప్రపంచమున నీ వొక సత్యము కాకున్నను సత్యాభాసమనియు నీ స్థితి మేము కాదన జాలమనియు, నీ సామర్థ్యమును మేము పూర్తిగా నిరోధింప జాలమనియు నంగీకరించుచున్నాము. దయానందుడు హరిద్వారమున నించుమించుగ నీ ప్రకారమునే భావించెనని నేను తలంచుచున్నాను. ఏలయన కుంభమేళము జరిగినతోడనే తన సర్వస్వమును వస్త్రములను పుస్తకములును సహితము పరులకొసగి తన దిగంబరత్వము నాచ్ఛాదించుట కొక్క కటివస్త్రము మాత్రము ధరించి గంగాతీరమున దినములుగడపుటకు, ప్రపంచముతో సంబంధము మానుటకును, దేవభాషనే కాని దేశభాష నుచ్చరింపకుండుటకును నిశ్చయించుకొనెను.

పాఠకుడా! నీ వాయనను సత్వర స్వభావుడనియు విషణ్ణ హృదయుడనియు ననకమున్నె సంగతి సందర్భములను లెస్సగా గ్రహించుము. ఉత్తమ మేధా గర్భములగు శీర్షములను, ఆర్య నాసికలను, ప్రతిభాయుతములై ప్రకాశమానములగు నేత్రములను గలిగి, భూతలమున గాన వచ్చు మానవగణములలో నుత్తమజాతియన్న ప్రఖ్యాతి గాంచి, విస్తర సంఖ్య పుస్తక పరిజ్ఞానులను అశేషముగా పారంపర్య ధీమంతులను గలిగి యుండి, మీ యిచ్చవచ్చిన తత్త్వ విషయమున మీతో వాదము కావించి మిమ్ము పరాభూతుల జేయుటకు సమర్థులును సంసిద్ధులును గూడ నగు లక్షోపలక్షల జనమండలిలో, అయ్యో! అన్ని లక్షల జనులలో మనము మనస్ఫూర్తిగ నిర్ణయించినదు సుఖముగా విసర్జింపజాలని రక్త మాంసోపేతమగు నీ తుచ్ఛ శరీరమున బంధింపబడి నన్నాళ్ళు

ప్రపంచయాత్ర కత్యంతావశ్యకములగు దృఢలోక జ్ఞానమును వ్యవహార జ్ఞానమును గలిగియున్న వ్యక్తులను, అతి ప్రయాసముతో నల్ప సంఖ్యాకులను మాత్రమే నీవు ఏర గలుగుదువు. అంతయు తలయే కాని యవయవములు శూన్యము — ఈరకము మనుష్యులచే దయానందుడు తన చుట్టును మూగుచుండగా జూచెను. వీ రెట్లు జీవింతురో, ఎట్లాచరింతురో, మన జీవితమును మనోభావములను గూర్చి యెట్టి యసంగత విరుద్ధాశయములను వ్యక్తీకరింతురో ఘన మించుక మచ్చు చూతము.

" మనమనోనేత్రము నెదుట నేదియో యొక స్వరూప మేర్పడ కుండ మనము భగవంతుని ధ్యానింపజాలము. కావున మనము స్వరూపముల నర్చించినను ఆదర్శరూపముల నారాధించినను నొక్కటియే రెండును విగ్రహార్చనములే. మనుజుడు తనయుద్దేశమును (అనగా తన్ను కార్యమునకై ప్రేరేపించు నుద్దేశమును) బట్టి నిర్ణయము చేయబడును. కాని క్రియల వలనగాదు ఒక్కగంగాస్నాన మొక దేవాలయమును నిర్మించుటకంటెను దినమునకైదు పర్యాయములు ప్రార్థనము చేయుట కంటెను నెక్కువ పుణ్యప్రదము. "

" ఆచరణము నం దనాచరణమును, అనాచరణమునం దాచరణమును గాంచగల్గు నాతడే నిక్కమగు జ్ఞాని. "

" ఎవ్వని కర్మ కామ వినిర్ముక్తమో, ఎవ్వనికర్మలు జ్ఞానాగ్నిచే దగ్ధములగునో, ఆతడే పండితుడని జ్ఞానులందురు ఆతడు తన కర్మఫల కాంక్షను విడిచిపెట్టును. ఆతడొక కార్యము నాచరించు చున్నను ఆచరింపకుండును. ఆతడనుద్విగ్నుడుగను ఆవేదనా రహితుడుగను నుండును. ఆతని యాత్మయు హృదయమును వినమ్రమై యుండును. ఆతడు శారీరక కర్మలను మాత్రమే యాచరించు చున్నాడు, కావున నేరము చేయుట లేదు. "

తత్త్వవిషయమున నంత యున్నతముగా—పై వాక్యములలో వలె మన మొగురజాలనంత యున్నతముగా నుద్గమించిన జనసంఘము వ్యవహార ప్రపంచమున నెట్లు నడచుకొనుచున్నారు ? గీత ననుదినమును అధ్యయనము చేయునట్టియు వేదాంతి నని దంభములు కొట్టునట్టియు గాఢ బ్రాహ్మణుడు సారస్వతి చేతియన్నము నారగింపడు. నీవొక ఫలమును భక్షించుచున్నప్పుడు గాని నీరు త్రాగుచున్నప్పుడు గాని నిన్నొక మహామ్మదీయుడు స్పృశించినంత మాత్రముననె నీవు నీమతమును, వర్ణమును పోగొట్టుకొందువు నీకులమునకు వెలియగుదువు. ఇంతకంటె నను కంపనీయ మెద్దియేని గలదా ? ఆత్మయొక్క పునర్భవమునందును కర్మ సిద్ధాంతమునందును విశ్వాసముగల జనులు స్వమత విరుద్ధముగా పిండముల నర్పించుచు యథాశక్తిని సకలభోగ్యవస్తువులను గో ధన ధాన్య ద్రవ్యాధులను అశ్వ, గజ, శకటములను సహితము తమ మృత బాంధవుల యాత్మ సుఖమునకై బ్రాహ్మణులకు దానము చేయుదురు.

ఏ బ్రాహ్మణునినైనను నీ ప్రథమ కర్తవ్య మేది యని ప్రశ్నించుము. ఆతడు తోడనే స్పష్టముగా అధ్యయ నాధ్యాపనములని జవాబు చెప్పును. కాని బాలురకు సాధ్యమగు నంత యున్నత విద్య నొసగుచుండగా బాలికలను జదివించుటకే యియ్యకొనడు. పెనిమిటి యొక మహా మహోపాధ్యాయుడు. పెండ్లాము జ్ఞాన వృక్షము యొక్క మధుర ఫలమును రుచిమాడ కూడని యవ్వ. ఇట్టి యసమ సంబంధ జన్యమగు సంతానము చాలభాగము మూర్ఖముగను అసమర్థముగను నియమ విరుద్ధముగను నుండుటలో నాశ్చర్యము లేదు.

పరిణయ మొక పరిహాసన మైనది. మనముమన గనుసుధనపు గరువముచే ప్రకృతినే త్వరపరుపనెంచు చున్నాము. మన పుత్రునికి మనము సిరిసంపదగల నొసగజాలక పోవచ్చును. కాని పత్నిని సమకూర్ప వలెను. ఆతని యనర్హతను అనిష్టమును మన మాపంతయేసి పాటింపము

క్రొమరునికై నను ఆయాజ్ఞను కాదనుటకు గాని, ఆ భార్యను వర్జించు టకు గాని యెట్టి స్వాతంత్ర్యమును లేదు. ఆతడు మృత్యుదేవతనైన జయింప నాశ వహింపగలడు. కాని గృహమును నరకముగ నొనర్చు గయ్యాళి పెండ్లాము బారినుండి మాత్రి మెన్నడును తప్పించు కొన జాలడు. కావున మనము బొత్తుగా వహింప గూడనట్టియు హితాహిత కరణమునందతి సమర్థ మగునట్టియు నధికారమును ఇంచుక జాగ్రత్తతో నుపయోగింప జెల్లదా ?

కట్ట కడపటిదియు, సుస్పష్టమును, అత్యంత విషాద జనకమును నగు దుర్గుణము స్వార్థపరత్వము. ఈ విషయమున హిందువులము మనము ప్రపంచము నందలి ప్రతిజాతిని పరాభవింతుము. ప్రజాసేవా సక్తి, స్వార్థత్యాగము, దేశహితము—ఈ మాటలు హిందువున కర్థము కావు. అవి యాతని హృదయమున కుత్తేజ మొసగ జాలవు.

వ్యష్టిజీవన తత్త్వము హిందువులచే నత్యంత దుష్ఫల ప్రదముగా క్షీణింప జేయ బడినది. దేశమున నెన్ని వ్యక్తులున్నవో యన్ని వర్ణము లును అన్ని మతములును అన్ని తత్త్వములును నేర్పడినవి. సర్వ సామా న్య కార్యము సర్వ సామాన్య మతము ఇవి వారు బొత్తిగా గ్రహింప జాలని నూతన భావములు. 'ప్రతి మానవునకును తాను పరిష్కరించు కొన వలసిన స్వకీయభవితవ్యము కలదు.' అని చెప్పి బ్రాహ్మణుడు తన పవిత్ర తర్కమును విచిత్ర తత్త్వమును ధారగా గురిపించి నీ లోకజ్ఞాన మును తుడిచిపెట్టి నిన్ను నిస్సహాయునిగను పంథాశూన్యునిగను నొన ర్చును. సుదూరవిఖ్యాతుడగు ప్రకృతకాలపు సాధు హిందూపుత్రుని వాక్ప్రగల్భత నుట్టిది.—అంతయు మహావైదుష్యమే కాని లోకజ్ఞాన ము మాత్రము పూర్ణానుస్వారము.

దయానందుని హృదయము చలించెను. ఆయన వైహికోద్యమ ముగండె విరమించెను. ఆయన కున్న పుస్తకములను వస్త్రములను

త్యాగము చేసెను. కొన్ని గురువర్యుడగు విరజానందుని కంపెను ఆ ధీర వృద్ధుడు శిష్యుని నిశ్చయమును మౌనముతో నాలకించెను మేలని మెచ్చుకొనలేదు. అయ్యో ! యని పెదవి విరువలేదు.

గంభీర మౌనము ! హిందువు లెల్లరు నట్టి మౌనవంతులగుట యెంతయు వాంఛనీయము. అయ్యో ! వారు మౌనము నందలి యుత్కృష్టత నెఱుగరు. వారి నాలుక యెల్లప్పుడును తమ యాత్మకే విద్రోహ మొనర్చుచుండును.

కాని మహాపురుషు డెందును సాధారణ మానవునివలె నుత్సాహ శూన్యుడుగను నిరాలోచనాపరుడుగను గడుసువాడుగను, తటస్థుడుగను నుండడు. ఆతనియందు భూతములయొక్క తీక్ష్ణోగ్రతలు కానవచ్చును. అద్భుతమును అజ్ఞేయమును నగుచు విశదముగ నుండు నొకశక్తివెలుపల నుండికాక యంతరమునుండియే యాతని పురికొల్పుచుండును. నీ యిచ్చ వచ్చినచో దానిని భ్రాంతి యని పిలువుము. కాని యాశక్తి నిర్వివాదాంశమై యాతనియందు తేజరిల్లుచున్నది. దానిని నీవు గ్రహింపవలెను

దయానందుడు తన పీతాంబరమును పరిత్యజించెను గాని తన యుత్సాహమును చల్లార్పలేకుండెను. ఆయన యింకను బోధించుచునే యుండెను. ఆయన యెచ్చట కరిగినను మూఢ విశ్వాసములను పారద్రోలి వైదిక జీవనమునకు మరలి రమ్మని యుద్ఘోషించుచుండెను. వితర్కములను శాస్త్రచర్చలను గూడ నాయన సాగించుచుండెను. ఏలయన మన పోపులు * (ఇట్లని యాయన మన నైష్ఠిక పండితుల ననుచుండెను.) తమ స్వలాభమును తాము పరాజితులై వినీతులగునంతవరకును నప్రయాసముగా విడిచిపెట్టరు. మన యీ మానసిక భావ మాశ్చర్యకరమైనది. ఎన్నిరకములు! ఎన్ని యందములు! ఎన్ని మార్పులు! ఈ తారాగణముల జూడుడు.

* అనగా క్రైస్తవమతాచార్యులు.

1868 వ సంవత్సరములో కర్ణవాసపురమున దయానందుడు పండిత హీరా వల్లభ పార్వతీ శాస్త్రితో నొక వితర్కము చేసెను. ఈతడు తన విగ్రహములను సభామధ్యమునకు గొనివచ్చి 'దయానందుని చే వీనిని పూజింప జేయుదును. లేదా నేను వాని నర్చించుట మానెదను.' అని ధైర్యముతో ప్రతిజ్ఞ చేసెను. తొమ్మిది గంటల సేపు చర్చ జరిగెను. తుదకు దయానందుడా పండితుని సమ్మతిపరుపగల్గెను. అంత నాయన యావిగ్రహములను తత్క్షణమే గంగా గర్భమున కర్పించెను.

సురోను పురమున పండిత అంగద రామ శాస్త్రితో మఱియొక వివాదము జరిగెను. ఆయన కూడ తన మతమును స్థాపించుకొనలేక పోయెను. ఆయన నిజముగ ధీరునివలె స్వపక్షమును వదలుకొనవలసి వచ్చెను. ఆయన బహిరంగముగా ప్రతిమార్చనము ప్రమాదకృత్యమనియు పాపజనకమనియు నుడివి తన సాలి గ్రామములను నదిలో పార వైచెను. ఆయన చుట్టములును, ఇతర బ్రాహ్మణులును, క్షత్రియులును, మఱికొందఱును యాతని మార్గమునే యవలంబించిరి.

కాని ఫరుక్కా బాదు నందలి శ్రీగోపాల శాస్త్రి మఱియొక మాదిరి మనుష్యుడు. ఆయన తరగతి వార సంఖ్యకులుగ నుందురు. ఆయన దయానందునితో ఖడ్గము దూసి, తుల్యుడు కాలేక, సహాయము నకై వారణాశికి పరుగెత్తెను. అచ్చటి పండితు డొక్కడాయనకు విగ్రహారాధనము యోగ్యమను శాస్త్ర ప్రమాణ మొసంగెను. ఆయన పరమ సంతోషముతో మరలి వచ్చెను. ఆయన యానందమునకు మేర లేకుండెను. ఆయన యుత్సాహావేశముచే దయానందు డున్న నెలవున కతి సమీపమున నొక వెదురు కఱ్ఱను పాతించి తన యనుచరులను బిలిచి దాని కభిషేకము చేయుమనెను. అయ్యో! ఇది యెంత సంతాపకరమగు దృశ్యము! ఒక మహాశక్తిమంతుడగు పురుషుని బరీక్షించుటకై ప్రకృతియే యిట్లనేక శత శోధనముల జరుపుచుండ నోపునా? కాశీపండితుని

ప్రమాణశ్లోకము దయానందుని చేతి కీయ బడెను. ఆయన దానిం జదివి 'మూఢుడీ! కాశీపండితుల వైదుష్య వివేకములను.' అని యుగ్గడించి యాక్షణమందే యా ప్రమాణవాక్యము నతి సమర్థతతో ఖండించెను.

ఇంకను 1869 జూలై 31 తేదిని కానూపురు నగరమున, గీర్వాణ పండితుడును, సహాయకరగ్రాహియు (అసిస్టెంటు కలెక్టరు) నగు డబ్లియు తెయిరాగారి యాధిపత్యముక్రింద జరిగిన వితర్కము ఉదాహరింపదగి యున్నది. శాస్త్రార్థము వినుటకు వకీళ్లును,జమీందార్లును, వర్తకులును ఉద్యోగులును పలుతెరగతుల జనులును 30,000 సంఖ్యకు పై బడి సమావేశమైరి. తెయిరాగారు మధ్యవర్తిగ నెన్నుకొనబడిరి. చర్చనీయాంశము 'వేదములలో విగ్రహార్చనము; పూర్వాచార పరుల పక్షమున హాల్డారు ఓర్ఝాప్రతి నిధిగ నిలిచెను. కాని యాయన చూపగల్గినదంతయు వేదములు విగ్రహపూజను నిషేధించుట లేదనుమాత్రమే దీనికి స్వామి 'ఎవ్వరైన నిన్ను ప్రాగ్దిశకు బొమ్మన్నచో, నీవన్యదిశకేగుట యాతని యభిమతము కాదని నీవు గ్రహింపవలెను. అని జవాబు చెప్పెను. ఈసభారంగమున [అసందర్భప్రశ్నములును పాక్షిక దృష్టియు మిక్కుటముగా నుండెను. అయినను తెయిరాగారు 'స్వామివారి హేతువులు శ్రుతివిహితములుగ నున్నవి' అనివ్రాసియున్నారు. పక్షపాతము సామాన్యముగా నశింపదు. అట్టితరుణములలో ప్రజలనావేశించు నుద్రేకము న్యాయనిర్ణయమునకు పూనుకొననీయదు. తెయిరాగారు సభావేదికనుండి వెడలినంతనే వారెల్లరును 'విజయము—విజయ' మని యరచుచు సంతోషముతో నుబ్బితబ్బిబ్బు లగుచుండిరి. వారుహాల్డారు ఓర్ఝా నొక శకటమున నెక్కించి జయ జయ ధ్వానములు చేయుచు వీథులలో నూరేగించిరి. ఆహా! ఏమి విజయము! మఱికొన్ని నాళ్లకే హాల్డారు ఓర్ఝా

ఉర్దూభాషలో నిట్లని యొక ముఖ్యపత్రిక ప్రకటించెను. దీనివలన వారి విజయస్వభావమును దెలిసికొనగలము.

“విస్తరసంఖ్యాకులగు బ్రహ్మక్షత్రియ వైశ్యులు దయానందుని బోధనముల ననుసరించుచు తమ ప్రాచీనకులమును పరిత్యజించి తమ విగ్రహదైవములను గంగలో పారవేయుచున్నారు. ఇది యుక్తము కాదు. కావున మేము తెలియజేయున దేమనగా దయానందుని బోధనముల నామోదించువారు తమ విగ్రహములను దయచేసి గురుప్రసాదసుకుల్ మహారాజుగారి మందిరమునకు గాని ప్రియాగనారాయణతివారి మహారాజుగారి భవనమునకుం గాని గొనిపోయి యర్పించవలయును అట్లు చేయుటకు వారికి కాలము చేకూరదేని నాకు తెలుపవచ్చును. నేనేవానిని తెచ్చికొందును పారవేయుటవలన వారికొనగూడు పాపము సంస్కృతగ్రంథములలో నుదాహరింపబడియున్నది.—ఓర్ఝూహోల్దారు”

కోమలహృదయుడవగు నోహోల్దారు ఓర్ఝూ! నీయెడదలో జాలి పాలు కొంచె మెక్కువగ నున్నదేమోయని భీతిల్లుచున్నాను. ప్రకృతి కాదాచిత్కముగా పురుష స్త్రీలను పొరపడినిర్మించినను, ఆమె యమితముగ స్త్రీ పురుషులను గూడ నిర్మించి మనలను సమాధానపఱచి, తన ప్రమాదాధీనులైన కుమారుల నోదార్చుటకు సంసిద్ధురాలయియున్నది.

## షష్ఠాధ్యాయము

### కోటముట్టడి.

సంధిగ్ధసమయము సమీపించినది. దయానందు డిదివరకే కాశీనగరమునకేతెంచి విగ్రహార్చనమును నానామూర్ఖవిశ్వాసములను దురాచారములను దూషించుచుండెను. ఆయన యానగరమున జేరినది మొదలు (1869 అక్టోబరు 22 లేక 23 వ తేదీ) పండితులును విద్యార్థులును ఆయన యుపన్యాసముల వినుటకై మూగుచుండిరి. కాని శాస్త్రార్థము చేయుటకై యొక్కరు నంగీకరింపకుండిరి. ఒకనాడు మనస్వామి పండితరాజా రామశాస్త్రిని తనతో శాస్త్రచర్చచేయుటకై యాహ్వానించెను. ఆమీద నాపండితుడు "నాకంగీకారమే కాని నాకొకమంచికత్తి యీయవలెను. ఏలయన నేనాతనికి యుక్తముగను సంపూర్ణముగను ప్రత్యుత్తరమిచ్చెదనని యాతనిముక్కుకోయుదును. అనికబురంపెను దీనిపై స్వామి "ఒకకత్తి కాదు. రెండుండవలెను. శాస్త్రార్థము లేనిచో శస్త్రార్థమైన జరుగును." అనిబదులు చెప్పెను. ఆమీద నాపండితుడు "మంచిది కానిండు. ఆయన యిప్పుడు కాశీలోనేయున్నాడు కావున సంగతి చూడగలను" అనిబడాయి కొట్టెను. కాని యావిషయమై చివర కేమియు జరుగనేలేదు.

ఎట్టకేలకు కాశీమహారాజు పండితమండలిని బిలిచి "వేదములలో విగ్రహాపూజలేదు ? అను దయానందుని వాదమును పూర్వపక్షముచేయుటకు బహిరంగసభ చేయగోరెను. అయ్యది 1869 నవంబరు 16 వ తేదీని సమావేశమగుటకు నిర్ణయము చేయబడెను. రక్షకభటులను రప్పించుట కేర్పాటు కావింపబడెను. అదియంతయు చారిత్రికదినము.

కాశీనగరమా! సకలవిద్యలకును పీఠమై, పౌరాణిక నాగరికతకు ప్రధాన స్థానమై ప్రకాశించు ఓకాశీనగరమా! పుణ్యప్రదములగు పురములలో నెల్ల నగ్రగణ్యమై, భారతస్వర్గమై, నీయంకమున మృతినొందినవారికి ముక్తిదాయినివై వెలయు ఓ కాశీనగరమా! ఎందలి వీధి యందలి కంకరరాయియు నీశ్వరునివలె సన్మానింపబడుచున్నదో అట్టి ఓకాశీనగరమా! అస్మత్ప్రియ పురీవతంసమా! నాగర్వమా! నాసాంత్వనమా! నాసర్వమును నశించినది. ఈతరుణమున నీవినాశము గుప్పెటలో నున్నదనియు, నీజ్యోతి యారిపోవనున్నదనియు దెలియుట యాకధిక సంతాపకరముగ నున్నది. ఏహిందూపుత్రుడు—ఒక్కక్షణము జాతీయోత్సాహమును ఒక్కబిందువార్యరక్తమును గలుగు నే హిందూపుత్రుడు ప్రపంచమునందలి సాటి జాతులు దృష్టిలో నిస్తబ్ధీకరించ నెంచును? కాని యొక గర్విషము నీశరీరమున బ్రవేశించి, నీయారోగ్యమునకు హాని చేయుచు నీప్రాణమునకు ముప్పు గలుగజేయుచున్నది. ఆగరళమును వెడల గ్రక్కించుటకు శీఘ్రప్రయత్నము జరుగదేని తత్ఫలితము—అది చెప్పుటకు దైవజ్ఞులక్కరలేదు—దారుణముగ నుండును. ఏలయన అసత్యమెంత తడవు జీవించినను, ఎంతఘనముగా వర్ధిల్లినను, కట్టకడపటి కది నైజధర్మముచే నాశనమొందియదృశ్యము కావలెను. తదను చరులు తమహృదయ శోణితముతో దమ కలుషములను గడుగుకొనవలెను. దయానందుని గూర్చియు ఆయనకృత్యములం గూర్చియు నెవరేమి చెప్పినను ఆయన మనో నిష్కాపట్యమును గాని యున్నతోద్దేశ్యమును గాని నే నించుకయు శంకింపను. ఆయన విగ్రహార్చనమును మొదటికే ముట్టడించిన నది యశస్సంపాదనమునకై కాదు, పగచే గాని యసూయచే గాని శత్రువులను ఆయనకు శత్రువులెవ్వరు? చెరుపుటకు గాదు, చరిత్రనుండి యొక విఖ్యాతనామమును తుడిచివేయుటకు గాదు, అది యుత్తమమును ఋజువర్తనమును కార్యతత్పరుడును నగు పూరుషు డెన్నుకొను

నేకమార్గమున—అనగా సూటియగు మార్గమును దన పరమావధిని జేరుకొనుటకేయైయున్నది.

ఆయన స్వ ప్రతిష్ఠాభివృద్ధుల కాస వహించినచో వేద సీమను మీటుటకు బదులుగా—వేదముల యుత్కృష్టతను వాని యీశ్వర సంభూతిని ఘోషించుటకు మారుగా స్వ మత మొండు ప్రతిష్ఠాపించు నూతనాచార్యుడై తనకాలమున సులభతరముగా నధిక తర కీర్తిని గడించి యుండును. ఏలయన మన దేశమున నుపయించు నూతన కాలముయొక్క భావము వేద విరుద్ధముగా నుండునని యాయన గ్రహించి యే యుండును. ఈవిషయమున నెవ్వరేని శ్రోతగా పరిశీలించినచో ఆయన శ్రుతి విహితములగు సంస్కారములను గూర్చి యెట్టి శ్రమ పడెనో తెలియగలదు. మాలికయు తిలకమును ఎవ్వరికిని ముక్తి నీయ జాలవని యాయన యుక్తముగా నిరూపించెను. అయితే యజ్ఞోపవీత మనగా నేమి? ఠాకూరు శివలాలు అను నాయనకును స్వామివారికిని జరిగిన యీ క్రింది ప్రస్తావనమే ప్రత్యుత్తర మిచ్చును.

ఠాకూరు:—ఉపనయన సంస్కారము మానినచో నష్టమేమి?

స్వామి;—యజ్ఞోపవీత ధారణము చేయని వారికి వైదిక కర్మాధికారము లేదు.

ఠాకూరు—ఉత్తము డెవ్వడు? యజ్ఞోపవీతరహితుడగు ధర్మాను వర్తియా లేక యజ్ఞోపవీత సహితుడయ్యును అధర్మ జీవనుడా?

స్వామి—సత్కర్మల నాచరించు వాడే యుత్తముడు కాని: సంస్కారములు చేయకుండుట వేద శాస్త్రములకు విరుద్ధముగా ప్రవర్తించుట యగును. వేద శాస్త్రములకు భిన్నముగా వర్తించుట యీశ్వరాజ్ఞల నతిక్రమించుట యగును. ఈశ్వరాజ్ఞా తిరస్కారము చేయుట నిరీశ్వర వాదిగ నుండుట యగును.

ఈ విధముగ ప్రశ్న మంతయును వేదముల యపౌరుషేయత్వ ము వైపునకు మరలును. దయానందుని గ్రంథముల వలనను ఆయన యుపన్యాసముల వలనను ఆయన జీవిత భావము వలనను వేదము లీశ్వర దత్తములని యాయనకు గాఢవిశ్వాస ముండినట్లు విశదమగుచున్నది. అంతటి కుశాగ్ర బుద్ధియు వివేచనా యుతుడును ఎట్లు లట్లు విశ్వసింప గల్గెనని కొందఱు పాఠకు లాశ్చర్యమందవచ్చును. ఇందుకు సమాధాన ము సులభము. ఆయన వేదములలో నెంతయో యుత్కృష్ట జ్ఞానమును ఉన్నత సత్యములనుఁ గంభీరార్థములను గన్గొన గల్గి యుండుటచే, అ య్యవి యీశ్వర ప్రేరితములు కాక యన్యథా కా జాలవని తలంచియుం డెను. మన పూర్వీకులు మూడు నాలుగు వేలేండ్లక్రిందట—ప్రమాణ ము లేకుండుటచే మనము సరిగా కాల నిర్ణయము చేయజాలము; కాని యింకను చాల పూర్వమే, ప్రపంచమున నే నాగరకతయు పొడ సూ పక మునుపే యై యుండవచ్చును—అంతటి మహోత్కృష్టములగు వేద ములను అసదృశములగు షడ్దర్శనములను రచింపజాలినవో వా రీశ్వరా విష్టులని విశ్వసించు వారిని మనము తప్పక క్షమించవలెను. మనము ప్రకృతము నుండి చాల దూరము పోతిమి. ఇక కాశీ సభకు మరలు దము.

నిర్ణితదినమగు 16—11—69 వ తేదీని సాయంకాలము నా లుగుగంటలకు కాశీ నగరము నందలి పండితు లందఱును సమావేశమైరి. విశుద్ధానంద స్వామి, బాల శాస్త్రి, మాధవాచార్య, శివసాహె, వామ నాచార్య. జయనారాయణ, తర్క వాచస్పతి, తారాచరణ తర్క రత్న, కైలాస చంద్ర, నారాయణశాస్త్రి మున్నగు పండితు లాసభ నలంక రించియుండిరి. అందఱును వచ్చిరి కాని శాస్త్రార్థముచేసి ప్రతిపక్షుని ముక్కు కోయుదునన్న పండిత రాజారామశాస్త్రిమాత్రము రాలేదు. ఆయన వచ్చుటకు సాహసింపలేక పోయెను. ఆయన తన శిష్యుడగు బాల

శాస్త్రిని పంపియుండెను. కాశీమహారాజగ్రపీఠము నధిష్ఠించెను. వేల కొలది జనులు వచ్చిరి. దయానందుడు పండితులను మీరు వేదప్రామాణ్యము నంగీకరించెదరో యనిప్రశ్నించి చర్చ యుపక్రమించెను. వారంగీకరించెదమని జవాబుచెప్పిరి. అంతట స్వామి విగ్రహార్చనము నంగీకరించు వాక్యముల నుదహరింపుడని యడిగెను. ఎవ్వరు నొక్క వాక్యమేనియు జూపలేకపోయిరి—ఏలయన నందొక్కటియు లేదు. వారంతట పురాణములపై నానుకొని యందుండి వివాదాంశమును గూర్చిన శ్లోకముల నెత్తిచూపిరి. కాని దయానందుడు పురాణము లీశ్వరసంభవములు కావనియు, అవి వేదవిరుద్ధములనియు, అందుచే దాను వానిని ప్రమాణముగా గైకొననియు నొక్కిచెప్పెను. ఇప్పుడాపండితులు శ్రుతులనుండి పురాణముల ప్రామాణ్యము నంగీకరించు వాక్యము నొక్కదానిని జూపగల్గిననో వారు విజయులయి నేటికి మాట దక్కించుకొందురుకదా! కావున మాధవాచార్యుడు వేదములనుండి యీక్రిందియర్థ మిచ్చు మంత్రము గల రెండులిఖితపత్రములను ముందుబెట్టెను. "యజ్ఞమునకు పదిరోజులు కావల ఈపురాణములను వినుము." ఈవాక్యమునందలి పురాణమను పదమున కర్థమేమని యడిగెను. దయానందు డుత్తరము చెప్పలేదు. ఆయన యింకను యోజించుచుండెను. ఆయాలోచన రెండు నిముసములైన పట్టలేదట. కాని యింతలో నాపండితులు లేచి చప్పట్లుకొట్టుచు 'ఓడిపోయెను. ఓడిపోయె' నని కేకలు వైచిరి.

నిజముగా వా రోడించుటకు వచ్చిరి కాని వాదించుటకు కాదు. వారు తమ యాత్మరక్షణముకంటె, తమ మతరక్షణముకంటె, తమ దేశరక్షణముకంటె, తమ యశోరక్షణమునందే యెక్కువ యాతురతతో నుండిరి. ఆపండితులు వేదములనుండి విగ్రహార్చనము నంగీకరించుచు వాక్య మొండేనియు జూపలేక తెల్లపోయినప్పుడు దయానందుడే లేచి 'ఓడిపోయి రోడిపోయి' రని చేతులు చరచుచు బిగ్గఱగా నరచినచో

వా రేమి చేయ గలుగుదురు. అయితే వారి విజయము యదార్థమె నదా! ఈ విధమున విగ్రహపూజ శ్రుతి విహితమైనదే యని నిర్ధరించి నిలుపుకొన గలిగినచో ఆ పురాణములే యాధారముగ గొని ప్రపంచ మున జరుగు సమస్తపాపములను అపరాధములను, దుర్మార్గములను, లోక మెన్నడును విని కని యెఱుగనట్టియు, వినుటకు సహింపజాలనట్టియు మన పండితులు తాము అసంగతముగ గన్పట్టకుండుటకై యాచరణీయ ములను నట్టియు మహాపాతకములను వేదవిహితములనియు, ఈశ్వర సమ్మతములనియు ఋజువు చేయవచ్చును. ఇంతియె కాక పై వాక్యము లోని పురాణములను పదము అష్టాదశ పురాణములకును జెందునేని పురాణములు శ్రుతుల కన్న ప్రాచీనము లనవలసి వచ్చును. మన నైష్ఠికాగ్రేసరులగు పండితులీ యంశము నంగీకరింతురా? ఆర్య వా ఙ్మయ పరిచయము గల యే బుద్ధిమంతుడును ఈ విపరీత సిద్ధాంతము నంగీకరింపజాలడని నే తలంచుచున్నాను. నా యభిప్రాయమున ఆ వా క్యము ప్రక్షిప్తమైన గావచ్చును. లేదా ఆ పదభావము వే రెద్దియైనను వ్యాసవిరచితములగు నష్టాదశ పురాణములు మాత్రము కాక యుండ వచ్చును. దయానందుడు నిజముగా పరాజయము నొందెనా? అయ నా వాదము లెంత కాలము ప్రత్యుత్తరము లేక పూర్వపక్షము కాక యుండునో అంతకాలము నాయనకు పరాభవ మెక్కడిది?

కార్య మెంత న్యాయమో యపజయ మంత బాధాకరమని చెప్పుదురు. కాని కార్య యోగ్యతనుబట్టి కాక తాత్కాలి కావేశమును బట్టియే మనః పరితాపము హెచ్చుచుండు నని పరిశీలనానుభవములు తెలుపుచున్నవి నీకావేశ మెత్తినచో యుక్తాయుక్త విచారణ నవల ద్రోచి మొండితనముతో గ్రుద్దులాడుదువు.

దయానందుడు తన పరాభవమును (విరారు దానిని పరాభవమ న్నచో) మహాపురుషుని కనుగుణ మగునట్లు—శాంతముతో గ్రహిం

చెను. ఆయన యీసారి ద్విగుణీకృతోత్సాహముతో కృషి చేయ నారంభించెను. ఆయన వేదోపదేశములను ప్రజలకు బోధించుచునే యుండెను. ఆయన యుపన్యాసములు వినుటకు వచ్చు జన సంఖ్యను బట్టి 'పోపు' లెంత విద్వేషముతో నాయన నణగద్రొక్క జూచినను ఆయన యుద్యమము క్రమముగా ప్రాకుచు విస్తరిల్లుచున్నదని మనము సులభముగా గ్రహింపగలము.

# సప్తమాధ్యాయము.

## విధ్వంసనము.

1870 వ సంవత్సరము జనవరినెలలో ప్రయాగతో కుంభోత్సవము జరుగగా స్వామి యచ్చట కుపదేశించుటకు జనెను.

అనంతరము కర్ణావాసను పేరుగన్న మీర్జాపురమున కరిగెను. అచ్చట కొందఱు కుమతులు కలహము పుట్టింప యత్నించిరి. ఒక ముదుసలి పూజారి దయానందుని సమీపించి యాయన శిరముపై జేయి వైచి "అబ్బాయీ! నీ వింకను లేత విద్యార్థివి. మఱి కొంతకాలము చదువుకొమ్ము. పొమ్ము." అని చెప్పెను. దయానందుడు మారకుండ నెంచెను. కాని వా రల్లరి మూక యని గ్రహించినంతనే 'ద్వారము బంధించిరండు. మీ యందఱకును నే నొక్కడనే యుద్ది యగుదును' అని గభీరోచ్చైస్స్వనముతో గర్జించెను. ఆయన స్వరూప ప్రభవమును గర్జానాదమును తీక్ష్ణ నేత్రములును పరాభీకరముగ నుండెను. ఆ కంటకులు తోడనే యొక్కరొక్కరుగ వెనుకకు జారిరి. ఎన్నియో పర్యాయము లాయనపై నిటుక ముక్కలును రాళ్ళును చెప్పులును గూడ రువ్విరి. కాని యొకప్పుడును ఎవ్వరును నెదుర్కొని చేయెత్త లేదు. ఎందఱో హంతకు లాయనను చావ మోదుటకును అగౌరవపరచుటకును నియుక్తులైరి. కాని యొక్కరును సాహసింపజాలక పోయెను. మీర్జాపురములో స్వామి యైదుపక్షములు కడపెను. 1870 మే నెలలో ఆయన మరల కాశీ వచ్చి ప్రతిమా పూజను అన్య దురాచారములను గూర్చి పండితులతో తర్కించుచుండెను. అచ్చట కొంతకాల మట్లు గడపిన పిమ్మట కాశీగంజికి వెడలెను. రెండున్నర యేండ్లు సంయుక్త పరగణాలలో సం

చారముచేసి మరల 1872 మార్చిలో వారణాశికి మరలెను. ఇక ప్రాజ్మండముల సంచారము ప్రారంభించి అరాకు బోయెను. అటనుండి పాట్నా నగరమును దర్శించెను. ఇచ్చట విద్యాప్రియులగు మున్షీ మోహనలాలు, సావన్ మల్, రాయి సోహనలాల్ మున్నగువారి కతిథిగ నుండెను. అశోకచక్రవర్తి రాజధానియని దిదృక్షువులకు జూపబడు ప్రదేశమున కనతి దూరమున నున్న భూపతిసింహ మహారాజు గారి యుద్యానవనమున విడిదిచేసెను. అచ్చట స్వామి యొకమాసము రోజులుండెను. ఆయన యథాపూర్వముగా విద్వాంసులను శాస్త్ర వాదమునకు రమ్మని ప్రకటనాపత్రములను బంపినను ఎవ్వరును శాస్త్రార్థము చేయుటకు నచ్చియుండలేదు. పండితులును ప్రభువులును ననేకు లా యుపన్యాసముల వినుటకై యనుదినమును బోవుచుండిరి. మిరాచిగంజి నివాసుడగు పండిత ఛోటేలాల్ సరస్వతి యను బ్రాహ్మణుడు స్వామి నిట్లు ప్రశ్నించెను. "మరణానంతరము ఆత్మ యేమగును?"

స్వామి:—యజుర్వేదసంహితనుండి మీకుత్తర మిచ్చుచున్నాను. మృత్యువునకు పిమ్మట జీవుడు వాయువున నదృశ్యమగును. పిదపవాడు జలభక్ష్యములద్వారా పురుషశరీరమున బ్రవేశించి, మరల నింద్రియ ద్వారమున స్త్రీ గర్భమును జేరి పునర్జన్మించును. అది యిట్టులే జనన మరణముల గాంచుచుండును. స్వర్గనరకము లెవ్వియు లేవు.

ఇచ్చట నొక ప్రశ్న సంభవించును. జలవాయుభక్ష్యముల ద్వారమున ఆత్మ మానవశరీరమున బ్రవేశించునెడల, క్షుద్రజంతువుల దేహములో గూడ బ్రవేశించి వానియందు ప్రసూతి చెందుట కూడ సంభవము కావచ్చునుగదా? అట్లు తటస్థింపజాలదని నే చెప్పజాలను. మనము చెప్పగల్గునదెల్లనిది? ఈప్రకృతి వికాసమంతయు గొన్నిమూల సూత్రముల ననుసరించి జరుగుచున్నది. కాని యథేచ్ఛముగా గాదు. ఆసూత్రములను గూర్చి మనకింకను నిశ్చయజ్ఞానము లేదు. అయితే మనుష్యుడు

కాని యశ్వము కాని వృక్షముకాని పరమాణువుల నైమిత్తిక సంయోగముయొక్క ఫలితమని చెప్పుటమాత్రము నాకు మిక్కిలి యజ్ఞానముగను మూర్ఖత్వముగను గన్పట్టును.

బాంకిపురమునందలి సుప్రసిద్ధన్యాయవాదియు, హిందూధర్మమున కుపోద్ఘాతము' అనుగ్రంథమునకు గర్తయు నగు బాబు గురుప్రసాదసేన్ యమ్. ఏ; బి. యల్. గారాయన నొకనాడు సందర్శించి యాసమయమున వారిని 'గార్హస్థ్యమును పరిత్యజించుట యుక్తమగునా ? యని విచారించిరి. స్వామి గార్హస్థ్యపదమునకర్థము చెప్పుమనెను. అంతట నాబాబు , భార్య, బిడ్డలు, ఇల్లు, చుట్టములు, మున్నగునవి' యనెను. స్వామి 'మున్నగునవియనగా నే' మని యడిగెను. 'ధనసంపాదనము' అని బాబు చెప్పెను. 'గృహ మనగానేమి ?' అని స్వామి మరల ప్రశ్నించెను. గృహ శబ్దమునకర్థము తినుట త్రాగుట పీల్చుట ఆదిగాగల'వని బాబుచెప్పెను. అంతట స్వామి గార్హస్థ్యమును పూర్ణముగా విడిచిపెట్టుట యసంభవమని విశదముగ చేసెను. నీవునీతండ్రిని తల్లిని సోదరులను గృహమును విడిచిపోవచ్చును. కాని నీయగత్యములను నీవుపరిత్యజింపజాలవు. నీవు మఱింత యాత్మకుక్షింభరుడవును స్వార్థపరుడవును నగుదువు.

ఆయన 1872 అక్టోబరు 30 తేదీని పాట్నానగరమును వీడి మాంఘీరునకును, అటనుండి భగల్పురమునకును వెడలెను. ఇచ్చట క్రైస్తవధర్మము నవలంబించిన యొకబంగాళీబ్రాహ్మణుడాయన వద్దకు తరుచుగా వచ్చుచుండెను. ఒకనాడాతను కన్నులు నీరుగ్రమ్మ నిట్లనెను. ''ఓస్వామీ ! నాయౌవనదశలో నేను తమ్ముగాంచియుంటినేని నాస్వమతమును స్వగృహమును గోల్పోయియుండను. నాసంశయముల నివారించెదరేమో యనియు నాపాదిరి యుపాధ్యాయుల యాక్షేపణములకు సమాధానమిత్తురేమో యనియు ననేక ప్రదేశములలో ననేకపండితుల చెంత కరి

గతిని కొందఱు జవాబు చెప్పలేక పోవుచుండిరి. కొందఱియుత్తరములు నాకసంతృప్తికరములుగ నుండెడివి. "

అదిసత్యము. అదియే దయానందుని విజయముయొక్క రహస్యము ఆంగ్లేయుల యాగమనమును, పాశ్చాత్యపద్ధతులచొప్పున శిక్షనొసంగు పాఠశాలా కలాశాలల స్థాపనమును, భారతీయయువకుల నేత్రములను దెరచెను. వారుతమపెద్దలను క్లిష్టములగు విమర్శనాప్రశ్నములను వైచుచు సంతృప్తికరములగు సమాధానములను బడయజాలకుండిరి కావున ఆలోచనాపరులగు విద్యావంతుల సందేహనివృత్తికొఱకొక మహాపండితు డావశ్యకముగ నుండెను.

దయానందుడు 1872 డిశంబరు 16 తేదీని కలకత్తాచేరెను. బారిస్టరు చంద్రశేఖరసేను గారాయనకు బస యేర్పాటుచేసెను. బారక్పురమునందలి రాజాసురేంద్రమోహన ఠాకూరుగారి ప్రమదావనమున వారిని బ్రవేశపెట్టెను. ఆకాలమున మహర్షిదేవేంద్రనాథఠాకూరును కేశవచంద్రసేనుడును ధార్మికసంచారజ్ఞ్యమున ప్రకృష్టపురుషులుగ నుండిరి. వారేస్వామివారికి హృదయపూర్వకముగ స్వాగతమొసంగిరనుట పరితోషావహము కేశవచంద్రుడాయనను తనగృహమున నుపదేశించుట కాహ్వానించెను. వర్ణవ్యాంశము వైదికధర్మమని నిర్ణయింపబడెను. ఆసభ 1873 జనవరి 9 తేదీని సమకూడెను. ఈయుపన్యాసమును గూర్చి 'పాఠక'యను బంగాళీపత్రికా సంపాదకులగుబాబు జ్ఞానేంద్రలాల్ యమ్. ఏ; బి.యల్. గారిట్లు వ్రాసియున్నారు: " రెండువిషయములు నన్ను మిక్కిలి ముఖ్యముగా నాకర్షించినది. మొదటిది, స్వామియొక్క సంస్కృతభాషా ప్రభుత్వము—ఈదినములలో స్వామి సంస్కృతమునే కాని యన్యము నుచ్చరించుట లేదని పాఠకులకు జ్ఞాపక ముండవచ్చును.—కించిత్ సంస్కృత పరిచయము కలవారికెల్ల సుబోధమున నుండు శైలిసౌలభ్యమున రెండవది, ఆంగ్లభాషావాసనలేని పండితుడట్టియున్నతాభిప్రాయములను

వెలిబుచ్చుట ! ఆయన కెట్టి జ్ఞానసంపద కలిగెను. ఆంగ్ల విద్య లేక యుంతగా నంతరదృష్టియు, వివేచనాశక్తియు, గలుగనేర్చునా ! ఈయంశము మనకు మనయందు—హిందూదేశమునందు విశ్వాసమును మరల గలిగించెను. ఇజ్రేలు దేశవాసులు మాత్రమే భగవంతుని ప్రసాదము బడయలేదు.

బాబు కేశవచంద్రసేనుడే స్వామికి హిందీ భాషా ద్వారమున నుపదేశింపుడని సూచించెను. స్వామి యా హిత వాక్యముయొక్క యుపయోగమును గమనించి బీహారు, పశ్చిమోత్తర పరగణాల కరిగినపిదప హిందీభాషలోనే యుపన్యసింప నారంభించెను.

కలకత్తాలో నాయన యుపదేశములు వినుట కనుదినమును వందలకొలది జనులు వచ్చుచుండిరి. ఆయన యనేక బహిరంగోపన్యాసముల నొసంగెను. డాక్టరు మహేంద్రలాలు సర్కారు గారికి ఆయుర్వేదమును పునరుద్ధరించుట మంచిదని సూచించెను. అనంతరము, 1873 ఏప్రిలు 1 వ తేదీని కలకత్తానగరమును వీడెను.

ఆయన వేదములను బోధించుటకై యొక సంస్కృత పాఠశాలను స్థాపింపగోరి పశ్చిమోత్తర పరగణాలలో గొంత ప్రయత్నము చేసెను. బంగాళము తన యుద్యమమునకు దయాపూర్వకముగను ఉత్సాహపూర్వకముగను సహాయము చేయునని యాశించెను. ఆయన కలకత్తా సందర్శనమునకు గల కారణములలో నిదియొకటి. ఆంగ్లభాష బంగాళీ హృదయము నెట్లు సంపూర్ణముగా స్వాధీనపరచుకొని యేలుచున్నదో యాయన గ్రహింపలేదు. ఆయన కాశీఘట్ట సంస్కృత విద్యాలయమును గాంచి యందు వేదములకు స్థానము లేకుండుట గమనించినప్పుడు బంగాళిభావమును గ్రహింప గలిగెను. ఆయన చక్కని వ్యవహారజ్ఞానము కలవాడు కావున నట్టియాశను వదలి యన్యత్ర సాధ్యములగు సాధనాంతరములచే తన యుద్యమ సిద్ధికై ప్రయత్నించుటకు కృత నిశ్చయుడయ్యెను.

ఆయన కలకత్తానుండి వెడలినపిదప వత్సరార్ధమునకు 1874 జూలై నెలలో స్వ విరచితమగు 'సత్యార్థప్రకాశ'మును ప్రకటనమునకై రాజా జయ కృష్ణదాసు సి. ఐ. యి గారి హస్తమున నునిచెను. మరల రెండేండ్లలో ఉత్తర, పశ్చిమ హిందూస్థానములలో ప్రతి నగరమందును ఆర్య సమాజమునకు శాఖలను స్థాపించెను. ఆయన వేదములను పరివర్తించుటకు గూడ ప్రారంభించి కాశీ నగరమున 1876 లో ప్రథమసంచిక వెలువరించెను.

ఇంతటినుండియు నాయన నిరంతరముగా క్రమముగా నిర్ణీత పద్ధతులపై పరిశ్రమ జేయుచుండెను. ఆయన యుద్యమము ధార్మిక, సాంఘిక, విద్యావిషయక సంస్కారము. ఆయన రచించిన బహుగ్రంథ రత్నములును, వైదికధర్మము పండితపామర విభేదము లేక సర్వజనసుబోధముగ నుండుటకై హిందీభాషలోనికి గావించిన వేద పరివర్తనమును, విద్యాసంస్కారశీర్షికక్రింద విభజింప బడవచ్చును. హిందూదేశమును తద్విషయికములగు నారంభములలో నీయన యుద్యమము ప్రప్రథమమై యప్రతిమానమై యున్నది. అయ్యది సాంగముగను సంతుష్టికరముగను నిర్వర్తింపబడి యత్యంతభావిఫలప్రదమైయున్నది.

ద్వితీయ శ్రేణిలో ఆర్యసమాజప్రతిష్ఠాపనమును చేర్కొనవచ్చును ఈకార్యము సాధారణమైనది కాదు. హిందూసంఘనిర్మాణము ఇయ్యది స్వకపోలకల్పితమై మహాభారమై అన్యజనదుస్సాధ్యమైయున్నది. ఈయు త్కృష్టకార్య నిర్వహణమున కాయన యితర సమకాలికులకంటె నధిక సమర్థుడై యర్హుడై యుండెను. తృతీయ వర్గములో నాయన బోధనము లను, పూర్వాచారపరులతోడి వితర్కములను జేర్చవచ్చును. ఆయన తన యుపన్యాసముల మూలమున అంధుల నేత్రములనుండి యజ్ఞానపు పొరలను దొలగించుచుండెను.

స్వామి కలకత్తా వదలి పిదప హుగ్లీ, భగల్పురము, పాట్నా, చాప్రానగరములను దర్శించెను. కడపటి పట్టణమున రాయి బహదూరు షాగులాం సాహాయను నాయన కతిథిగ నుండెను. అచ్చటి విద్వాంసులను స్వామితో శాస్త్రార్థము చేయుమనగా వారు దయానందునివంటి నాస్తికుని చూడనైన కూడదని ధర్మము విధించుచున్నది కావున మేమాతనితో సంభాషింప నొల్లమనిరి. దయానందు డామీద నుభయులకును మధ్య జవనిక వేయవచ్చుననగా వారందుల కియ్యకొనిరి. అట్లే వారొకనాడు కూడిరి. ఉభయపక్షములకును నడుమ తెరవేయబడెను. శాస్త్రచర్చ ప్రారంభమయ్యెను. కాని తత్పురపండితుల ప్రతినిధికి సంస్కృతమున ప్రసంగము చేయుటకైన నంతగా సమర్థత లేకుండెను. కావున త్వరలోనే వాదము ముగిసెను. అనంతరము స్వామి యుత్తమమును సత్యమును ప్రకాశమానమును నగు వైదికధర్మమెట్లు అపార్థము చేయబడుచున్నదో, ఎట్లయుక్తముగా బోధింపబడుచున్నదో, ప్రజాసంఘమెట్లజ్ఞానాంధకారమున బడి తోవగానక తొట్రుపడుచున్నదో ఎట్లు హింసాసంఘము నిర్ణిమిత్తముగ దురంత క్లేశ సంతాపములను తనమీదను తన సంతానముమీదను విధించుకొనుచున్నదో అచ్చటి సభ్యులకెల్లరకును దెల్లముగ బోధించెను.

ఆయన బీహారమునుండి సంయుక్తపరగణాల కరిగెను. మీర్జాపురము, కాన్పురము, కాశీ, ఆలీఘుర్, మధుర, బృందావనము ఈనగరములనెల్ల దర్శించుచు నుపన్యసించుచు పండితులతో శాస్త్రచర్చ చేయుచు సంచారము చేసెను. ఇప్పటికి దయానందుడు సుప్రసిద్ధు డయ్యెను. ఆయన యభిప్రాయములు విశేషముగా వ్యాప్తములయి యాసక్తితో స్వీకరింపబడుచుండెను.

1874 అక్టోబరు మాసాంతమున స్వామి బొంబాయినగరమునకు వెడలెను. ఆయన యుద్దేశములు స్వీయాభిప్రాయములతో నేకీభవించు

నరి యెంచిన కొందఱు ప్రముఖు లిచ్చట కాయన సాహాయ్యనించియుండిరి. కాని సత్వరముగనే స్వామివారి యాశయములు తమ కననుకూలములని ప్రకటమయ్యెను. అయినను స్వామి విశేష తత్పరతతో స్వకార్యసాధన మునకు బూనుకొనెను. ఈప్రాంతముల ప్రబలురై యున్న వైష్ణవ సాంప్రదాయులగు వల్లభాచార్యులమీదికి దండెత్తెను.

ఇచ్చట స్వామికివిషముపెట్టి తుదముట్టించుటకొక కుట్ర జరిగెనట. కానియీ కుతంత్రము బయల్పడి వారిప్రయత్నమునకు భంగముకలిగెను.

అనంతరము స్వామి న్యాయాధిపతియగు గోపాలరావు హరిదేశ ముఖ్ గారి యాహ్వానముపై అహమ్మదాబాదున కేగెను. ఆపురము నందలి రైలుస్టేషనువద్ద నొక సుప్రసిద్ధుడగు సేఠ్ (సెట్టి) స్వామికొఱకు కాచుకొని యుండెను. వారు శకటముపై నింటికేగుచుండగా ఆసేఠ్ తాను లక్షరూప్యములను వెచ్చించి యొక దేవాలయమును నిర్మించితినని ప్రసంగవశమున జెప్పెను. స్వామి యాయన భక్త్యౌదార్యములు దుష్ప థమున బ్రసరించినందులకు సిబొనసజాలకపోయెను. ఆసేఠ్ తన దైవ మును దేశమునునారాధించుట కింతకంటె నుత్తమమార్గమును గాననందు లకు తనవిచారమును వెలిబుచ్చెను. ఆయన యొక సంస్కృతపాఠశాలనునెల కొల్పినచో గొంత ప్రయోజనకరమగు కార్యమును నెరవేర్చియుండును.

స్వామి యిట్లనెను. “ వేదములయొక్క ప్రతి యొకటి కావలసిన చో హిందూదేశములో నయ్యది లభ్యము కానందున జర్మనీకి చేయి చాచవలసివచ్చుచున్నది. ఇది హిందూదేశమునకు కీర్తికరమా? ”

ఆయన యిచ్చట నుపన్యాసము లొసగుచు పండితులతో శాస్త్ర వాదము చేయుచు నొకమాసము గడపెను. అనంతరము రాజకోట కొక శీఘ్ర ప్రయాణము కావించి యచ్చటి రాజకుమార కలాశాలా విద్యార్థుల కొక యుపదేశము చేసెను. ఆకలాశాలాధ్యక్షుడు స్వామికి ఋగ్వేదము యొక్క రెండుప్రతులను బహుమానముగా సమర్పించెను.

# అష్టమాధ్యాయము

## నిర్యాణము

ఆయన బొంబాయికి మరలి వచ్చెను. ఈపునరాగమన మొక ముఖ్యకార్యముకొఱకు ఆర్యసమాజ స్థాపనార్థము. ఈ విషయము కొంత కాలమునుండి స్వామియొక్కయు వారిపక్షముయొక్కయు దృష్టి నాకర్షించుచుండెను. అయినను 1875 ఏప్రిలు 10 తేదిని గిరిధరలాల్‌దాసు కొఠారి బి. ఏ. యల్. యల్. బి. గారి యాధిపత్యముక్రింద జరిగిన మహాసమావేశమునగాని బహిరంగముగా ప్రకటింపబడలేదు.

1875 జూన్ జూలై మాసములలో స్వామి పునహానగరమున నుండెను. ఆయన యిచ్చట పదునైదుపన్యాసములు చేసెను. వీనిలో నైదుచారిత్రికములు ఒకటి స్వీయజీవితవిషయము శేషించినవి ధార్మికోపదేశములు.

1875 వ సంవత్సరాంతమున కాయన బొంబాయి మరల చేరెను. ఈతరుణమున సమాజమునకై యొక మందిరము ప్రత్యేకముగా గైకొనబడెను. ఈ నూతనసమాజము సుస్థిరమగు పునాదిపై నిలుపుటకే స్వామి యానగరమున నెనిమిది నెలలు గడపెను. మోక్షమూలరు భట్టాచార్య లోకనాథు ఇంగ్లాండుదేశమును సందర్శించి రండని స్వామికి సూచించెను. అందుకాయన, నన్నీదేశ జనులు, పాషండుడనుచున్నారు. నా పాషండత్వమెట్టిదో వారికి తేటపడునందాక నేనీదేశమును వీడను" అని బదులు చెప్పెను. ఈయంశమును బట్టి యాయనకు సమాజస్థాపనమునందెంత గాఢాసక్తికలదో తెలియుచున్నది.

1876 మే నెల యారంభమున నాయన కాశీకి వచ్చి వేదములను హిందీభాషలోనికి పరివర్తించుటకు బూనుకొనెను. ఆ గ్రంథమొక సుప్రసిద్ధప్రచారక సంఘముచే నెల సంచికలుగా ప్రకటింపబడెను.

ఈకాలముననే బోధనలును ఉపన్యాసములును శాస్త్రచర్చలును చురుకుగా జరుగుచుండెను. అనంతర మాయన సంయుక్త పరగణాలలో సంచార మొనర్చి 1877 సంవత్సరమున ఢిల్లీలో రాజదర్బారు జరుగగా నచ్చటి కరిగెను. ఆయన యుపన్యాసాదికములు కాక ఆయన తనకాలమున కెంత పురోగామియై యుండెనో తెలుపుటకు పేర్కొనదగిన ప్రధానవిషయ మొండుగలదు. ఆయన బాబు కేశవచంద్రసేన్, సర్ సయ్యదు అహమ్మదుఖాన్, బాబు కన్యాలాల్ అలఖ్ ధారి, మున్షీఇంద్రమర్, బాబు హరీశచంద్రచింతామణి, బాబు నవీనచంద్రరాయి, యను వారలతో గూడిన యొకసభను, హిందూదేశమున ధార్మిక, సాంఘిక సంస్కారముల ప్రచారణమునకు తా మెట్లుత్తమముగ దోడ్పడగల్గుదు మను విషయమును గూర్చి చర్చించుటకు సమావేశపరచెను. ఆయన సంకల్ప మొక్క యఖండ భారతవర్షీయోద్యమము. క్రమశః అది యసాధ్యమని విదితమయ్యెను. అది నేటికిని దుస్సాధ్యముగనే యున్నది.

1877 మార్చి 19, 20 తేదీలలో షాజహాన్ పురము జిల్లా చాంద్ పురములో హిందూ, ఇస్లాము క్రైస్తవముల మహాధర్మతత్త్వసభను కబీరుపంథియగు మున్షీప్యారీలాలుగారి కృషిచే సమావేశము చేయబడెను. శ్రీ స్వామియును బేరిల్లిపురమున నున్న రెవరెండు టి. జి. స్కాట్ గారును దేవబందులోని యరబ్బీపాఠశాల కధ్యక్షుడగు మహమ్మదు కాసింగారును ఢిల్లీనివాసియగు సయ్యదు అబుల్ మన్సూరుగారును, మురాదాబాదు నందలి ప్రఖ్యాత అరబ్బీ పారశీ భాషా కోవిదుడగు మున్షీఇంద్రమన్ గారును మతత్రయముయొక్కయు ప్రధానప్రతినిధులుగ నుండిరి. ఈ సభయొక్క ప్రధానోద్దేశ్యము సత్యాన్వేషణమును, ఏమతము స్ఫురించి

నను సత్యగ్రహణమునునై యున్నది. ఇంతకు మున్నెన్నడు నిట్టి సమావేశము జరిగియుండలేదు. వెట్టియాశలు వ్యర్థప్రయత్నములు నైనను ఎంతయు స్వాభావికములు! సర్వయుగములయందును సత్పురుషులును విద్వాంసులును ఈయద్భుతరహస్యముయొక్క గాంభీర్యమును గన్గొన నెంచిరి. జవనికకు వెనుకప్రక్క నొక్కచూపు దొరకుటకై వారు చేయని ప్రయత్నమును పడనికష్టమును గానరాదు. కాని తెర రవ్వంతయైన సంచలింపక యెప్పటి యట్లనే స్థిరముగా నిలిచియున్నది. కపిల, కణాద, బుద్ధుల కాలమువలెనే నేఁడును అంధకారము నిబిడమై కరాళమై దుస్సహమై యున్నది. ఇట్టి స్థితిలోనే మతమున సమగ్రసత్యము లేక యధికతరసత్యము కలదు అని విచారించుట కూడ తప్పమముగనే నిరాశాజనకముగ నున్నది. అయినను మానవస్వభావ మట్టిది! మీరు దానిని దౌర్బల్యమే యనుఁడు. కాని యేక్షేత్రమున లక్షలాదిజనులు విఫలప్రయత్నులైరో, ఆక్షేత్రముననే కృషి సలుపుటకు లక్షలాదిజనులు పునః ప్రయత్నము చేయుచుండుట నిక్కముగా మానవప్రకృతి యందలి యుత్తమగుణమని నే నెన్నుచున్నాను.

రెండు నాళ్ళు కూడిన పిదప నా సభ ముగిసెను. ప్రాయికముగ సభా నిర్మాతలు తాము పొందిన యపారశ్రమ కేవిధమునను లాభము చేకూరలేదని తలంచి యుందురు. వారు తమ్ము బ్రహ్మానంద సీమకు—పరమాత్మసన్నిధానమునకు నిదానముగా గొనిపోవు రాజమార్గమును ఆమహాపండితులును ముల్లాలునుపాదిరీలునుజేరిచూపగలరని యాశించిరి. వా రభిలషించినది—నేటికింకను ప్రజాసంఘు మభిలషించుచున్నది యీశ్వర సందేశమునే. జనసామాన్యమున కీ మహాసభలును ఈ వితరణములును ప్రభుత్వ పరివర్తనములును అన్నియు మిక్కిలి నిరాశ నాపాదించును. ఇంకను సత్యకాలము—కృతయుగము రాకుండుట, వారి కాశ్చర్యముగ నుండును. అది యేల తడవుచేయుచున్నదో వారికి

దురవగాహముగ నుండును. మానవప్రకృతికి మేరలు కలవని అదియు, యజ్ఞేయమగు నద్భుత రహస్యము నావంతయేని గ్రహింపజాలదనియు మన కొావగూను సౌఖ్యములతో సంతృప్తి గాంచుచు దుఃఖముల నోపికతో సహించుచు జీవితయాత్ర చేయవలెననియు ప్రపంచము నిరంతరము నిట్లే యుండుననియు, జవనికకు వెనుక మన మెఱుగదగిన దేద్దియు లేదనియు, వ్యక్తికి భూత భవిష్యత్తు లెవ్వియు లేవనియు, మనకు ప్రస్తుతముతో మాత్రమే నిమిత్తము కలదనియు. అన్యముతో మనకు పని లేదనియు, జన సామాన్యమునకు బోధించుట వలన నెద్దియేని లాభము కలదా ! మంచిది. ఈ యంశము లన్నియు నిదివరకనేక పర్యాయములు ప్రజలకు నూరి పోయబడెను. కాని ఫలము యథా ప్రకారమే. సంతృప్తి లేదు. అలభ్యము కొఱకు కాంక్ష యథాపూర్వకముగనే యున్నది.

స్వామి యిక ప్రథమ పర్యాయము పాంచాలమున కరుగును అది 1877 ఏప్రిలు మాసము ఆయన 19 వ తేదీని లాహోరు చేరును. పాంచాలు రాయన కత్యుత్సాహ పూరితమగు స్వాగత మొసంగుదురు. విగ్రహార్చనా మూఢ విశ్వాసముల మీదికి దాడి వెడలుటలో దమ వింతురీతు కావున ముఖ్యముగా బ్రహ్మసామాజికులు స్వామిం కధికాదరముతో స్వాగత మిత్తురు. వార్తా పత్రికలాయన నభినందించి యా యన యుపన్యాసములను ప్రశంసించును. జను లాయన యుపదేశముల నాకర్ణించుటకు తండోపతండములు గా వత్తురు. ఇంతియె కాక—పాంచాల స్వభావముచేనైన — వారా యుపదేశాను గుణముగ ప్రవర్తింప దొడగుదురు. గురునానకుని యుపదేశఫలితముగ నాప్రాంతమున వల్లలవాటుచున్న విగ్రహారాధనమునకు స్వామి బోధనములు గొ్ప్ర శ్లలివేట్టులగును. విగ్రహములు తమకిదివరకు ప్రత్యేకింపబడియుండిన సింహాసనముపై గాక తమకు యోగ్యతరములగు వీధులయందును ఇతర స్థలములయందును బహిరంగముగా పారవేయబడెను. 1877 జూన్ 24 తే

దీని లాహోరునగరమున ఆర్యసమాజము స్థాపింపబడెను. ఇచ్చట నిర్మించిన నియమావళి బొంబాయి ఆర్యసమాజ నిబంధనలకంటె స్పష్టమయి ఇటీవలి సమాజములన్నిటిచే నవలంబింపబడి దేశసంఘముయొక్క యంగీకృతమతమై యున్నది.

## ఆర్యసమాజ (వైదికధర్మ)
## నియమములు.

ఈశ్వరుడు ఆతనిస్వరూపలక్షణములు.

౧ సమస్త సత్యవిద్య, సత్యవిద్యచే దెలియనగుపదార్థము వీనికన్నిటికి మూలకారణమును నిత్యాధారుడును పరమేశ్వరుడు.

ఆతనిగుణములు. ఉపాసనము.

౨ ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిసంపన్నుడు, న్యాయవర్తి, దయాశీలుడు, అభవుడు, అనంతుడు, అనాది, అసదృశుడు, విశ్వాధారుడు, విశ్వేశ్వరుడు, విశ్వవ్యాపకుడు, విశ్వాంతర్నియామకుడు, సర్వజ్ఞుడు, అజరుడు, అనశ్వరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, విశ్వ విధాత ఆతడొక్కడే యుపాస్యుడు.

ఆతనివాక్యము వేదము.

3 వేదము యథార్థ జ్ఞానగ్రంథము వేదముయొక్క అధ్యయ నాధ్యాపనములును, శ్రవణోపదేశములును ఆర్యులకు పరమ కర్తవ్యములు.

సత్యము.

౪ మనము సత్యమును గ్రహించుటకును, అసత్యమును పరిత్యజించుటకును సర్వదాసంసిద్ధులమైయుండవలెను

ధర్మము.

౫ సమస్తకార్యములను ధర్మసమ్మతమున అనగా యుక్తాయుక్తములను విచారించి చేయవలయును.

ఉపకారము

౬ లోకోపకారము అనగా శారీరిక ఆత్మిక సాంఘిక హితము చేయుటయే ఆర్య సమాజముయొక్క ప్రధానోద్దేశము.

ప్రేమ, న్యాయము.

౭ మన ప్రవర్తన మెల్లరియెడలను ప్రేమ,ధర్మ, న్యాయానుసారముగ నుండ వలయును.

విద్య, అవిద్య.

౮ మనము అవిద్యను పారద్రోలి భౌతిక, ఆధ్యాత్మికమగు విద్యను వృద్ధి పఱుపవలెను.

వ్యక్తిత్వము. విశ్వహితము.

౯ ఆత్మ హితాచరణములో నెవ్వఁడును సంతృప్తినొందక సర్వ జన హితాభి వర్ధనమునందు స్వహితము నన్వేషింపవలయును.

పరతంత్రత. స్వతంత్రత.

౧౦ సర్వ జన హితకరములగు సామాజిక నియమముల కెల్లరును విధేయులై మెలగవలెను. వ్యక్తిహితదాయకములగు నియమముల విషయమై యెల్లరును స్వేచ్ఛమై సంచరింపవలయును.

తక్కిన నగరములును లాహోరు మార్గము నవలంబించుటలో నాలసించలేదు. అమృతసరము, గురుదాసపురము, ఫిరోజి పురము, రావల్పిండి. జీలమ్, వజీరాబాదు, గుజరన్వాలా, ముల్తాను ఈపురము లన్నియు సత్వరమే సమాజములను సంస్థాపించెను.

ఇట్లని పాంచాలమున స్వామి యుద్యమమున కవరోధము గలుగలేదని తలంపజనదు. పూర్వాచార పరాయణులెవ్వ మెచ్చటను, పంజాబునందును నిరోధము లేకయే లొంగిపోవ లేదు. దుర్బలులయొక్కయు కాతరులయొక్కయు నాయుధమగు దూషణము స్వామికి కళంకమునాపాదించుటకును ఆయనను ప్రజాపహాస్యమునకు గుఱిచేయుటకును యథాశక్తి ప్రయత్నించెను. కాని యాయన పవిత్ర ప్రవర్తనమును ఉదాత్త దేశోద్ధరణోద్యమమును నిందా సంశయముల కతీతములై వెలయుచుండెను.

ఆయన పావిత్ర్యాగ్నియందవి యన్నియు భస్మీభూతము లగుచుండెను.

లాహోరు సమాజముయొక్క యొక సమావేశమున సభ్యుడొకడు లేచి స్వామి యింకెటనుండియు 'సమాజ పోషకు' డని పిలువబడవలె నని ప్రతిపాదించెను. అందుపై స్వామి తమ కాచార్యత్వము అసహ్యమనియు తమ యుద్యమమెల్ల దాని మట్టి పెట్టుటకే యనియు సెలవిచ్చెను. వీరా రాధనముతో సంబంధించిన సమస్తమును ఆయన యనుమోదింప జాలకుండెను.

ఆయన యింతవరకును స్త్రీలు తన యుపన్యాసములు వినుట కంగీకరింపకుండెను. కాని పాంచాల నారీమణు లాయనకంటె గట్టివారు. వా రొక సారి సభారంగమున ప్రవేశము గాంచిరి. స్త్రీజనమునకు ప్రత్యేక ప్రదేశ మేర్పరింప బడెను. స్త్రీలు స్త్రీసమాజములను స్థాపించుకొని తమ భర్తలనే గురువులుగా దలంపవలెనని యాయన హితము గఱపెను. స్త్రీజనము నెడల నాదరమును శ్రద్ధను జూపనివారు మానవులు కారని యాయన వాకృచ్చెను.

ముల్తాను నగరమున ఆర్యసమాజము నెలకొల్పబడినప్పుడు స్వల్పసంఖ్యాకులే సభ్యులుగా జేర ముందంజవేసిరి. ఇంత స్వల్ప సంఖ్యయే! యని స్వామి నొకరు హేళన మొనరించిరి. అందుపై నాయన మహమ్మదునకు ప్రారంభమున ననుచరు లొక్కరే యనియు, అదియు నాయన యర్ధాంగియే యనియు ననెను.

స్వామిపంజాబులో పరిశ్రమచేయ నారంభించి యొకసంవత్సరమునకు పైగా గడచెను. ఆయన కృషి యిప్పుడొక యాకారమును దాల్చి ఫలోన్ముఖమగుచుండెను. ఆయన యుపన్యాసములును ఉపదేశములును పండితుల నేత్రములను దెరచి వారికి స్వయముగా యోజించుటకును, ప్రస్తుతపరిస్థితుల నాలోచించుటకును, ముందునకు జొరుచుకొని పోవుటకును తమ శక్తిని వెల్లడించుటకును నేర్పెను, అందుమీద స్నాభేదము లేక

సమస్త జనులును సమభాగమున 'భాయి భాయి' యనుచు చేతులు కలుపుకొనుటకంగీకరించు ఆర్యసమాజ సంస్థాపనము వారినూత్న భావములను క్రియారూపమును బొందించుటకు క్షేత్రమును గల్పించెను. యుక్త కార్య పరిజ్ఞానముమాత్రమే మనకుజాలదు. యుక్తకార్యమును యుక్తమార్గమున సాధించుట కూడ మన మెఱిగియుండవలెను. దయానందముని యుపన్యాసములు ప్రజలకు స్వతంత్రాలోచనమును నేర్పెను. వారు స్వబుద్ధి ప్రమాణముమీదనే కాని విశ్వాసముపై దేనిని నంగీకరింపకుండునట్లు అభ్యాసముచేసెను. అయితే ఆర్యసమాజస్థాపనము జనులు స్వదేశమునకును స్వసంఘమునకును ఉపయోగముగ నుండవలెనన్న వారన్యోన్యము నేకీభవించి పనిచేయవలయునను నీతిభావముతో నిండియుండెను.

ఆర్యసమాజము నెరవేర్చినకార్యముపై గానిదానిస్వభావముపై గాని తీరుమానముచెప్పుటకింకనుఇతిహాసమునకు సమయము రాలేదు. కాని యొక సుహృద్విమర్శకుడు తనయభిప్రాయమును దెలుపనంగీకృతుడగునేని, సంఘీభావమును సహకారిత్వమును సంపూర్ణముగా గాకున్న విశేషాంశమైన తత్సామాజికులపట్ల నిష్ఫలప్రదమైనదని నుడువ సాహసించెను. ఆర్య సామాజికుని యందెద్దియేని ప్రత్యేక లక్షణమున్నచో నయ్యది యాతని స్వాతంత్ర్యాత్మక స్వభావమే ఆతడు భూతలమున నెద్దానికిని శిరము వంచడు. ఆతని బిఱుసుదనము మతవిషయమునను, భావనావిషయమునను మాత్రమేకాదు. అయ్యది సమస్త విషయములందును—తత్త్వవిచారము నందును సమాజగృహ విక్రీణనమునందును గూడ ప్రకటితమగుచుండును ఆతడు సమాధానమునకు వచ్చుట యెఱుగడు. పరపక్షమువంకకు వంగుట యేమో యాతనికి దెలియదు. సహకారత కీస్వభావ మొంతమాత్రమును సహకారముగాదు.

ఫలితమేమన, ఆర్యసమాజమున కంతరమున విరోధ విశ్లేషములును, వెలుపల విశేషద్వేషమును వృద్ధిపొందెను

ఆర్యసామాజికనియామప్రతికూల ప్రకృతియొక్క కారణమునకై దూరాన్వేషణ మక్కరలేదు. ఆర్యులలో బహుళసంఖ్యాకులు చక్కనిలోక జ్ఞానపటులైనను విశేషవిద్యావంతులును ప్రగల్భప్రజ్ఞాన్వితులును గారు వారన్యులుకంటె నించుక వివేచనా యుక్తులైనను సామాన్య జనులు మాత్రమే యై యున్నారు అయితే వారవలంబించిన ఆర్యసమాజ నియమములు మానవసంఘ మింతవరకు నిర్మింపజాలిన మహోత్తమ ప్రవర్తనాసూత్రములు. కావున ధర్మమార్గావలంబనమునందలి యాతురతతో ఏదియో యొక యభిప్రాయమును పురస్కరించుకొని ముంగు వెనుక లరయక, గమ్యస్థానము నూహించక, పరుగిడుదురు. వారియుద్దేశము యోగ్యమే కావచ్చును. కాని యెంతటి యుత్తమనియమమైనను పరిస్థితుల ననుసరించిప్రయుక్తమగుచుండవలెను. సంక్షేపముగా చెప్పవలెనన్న, వారి వేరిటు లక్ష్యము నతిక్రమించును. చూడుడు దృష్టాంతమును: అత్యంత ముఖప్రియాలాపము అతివినయము, నీచసేవనము, నైతికభీరుత్వము, ఇయ్యవి హిందువుల ప్రత్యేకించి ప్రఖ్యాతి నార్జించిన స్వభావ లక్షణములు. ఆర్యసామాజికుడు తాను నూతనముగా నేర్చుకొన్న సుగుణము నందలి బద్ధభావముతో నే వ్యక్తియు ఏసంఘమును సహింపజాలనినిష్కాపట్యమును వహించుచున్నాడు. పట్టుదలయు నిష్కాపట్యమును శ్లాఘనీయములే, అన్యాభిప్రాయమునకు విధేయులగుట వారిప్రకృతిలో లేదు అయితే మనము ఋజుపక్షమునందుండి పరుడయుక్తపక్షమున నున్నను మనము నమ్రతతో లోబడవలసిన యవసరములు కొన్నిగలవు. మన పక్షముయొక్క యుక్తాయుక్త విచారణతో నిమిత్తములేకయే పరులకు వశంగతులము కావలసిన తరుణమును గలదు. ఆర్యసామాజికునకుపరానుకూల్యమును బానిసతనమును సమానార్థములు ఆరెంటికిని గల వ్యత్యాస మాతడు గ్రహింపజాలడు. ఆతని కన్నిటికి గూడ నొక్కటేమాట కలదు; నేను నాయిచ్చవచ్చినట్లు చేయుదును. ఇదియంతయు నసంగతము

ఒకసంఘము నందలి సభ్యులు అనుకూలముగా ప్రవర్తింప నేరనియెడల అనుచరులన్నమాట లేక యందఱు నాయకులే కావలెనని యూహించినచో, వారు తమ నాయకునకు గాని దేశమునకు గాని యెట్టిసేవనను చేయజాలరు స్వామిననుసరింప యత్నించువే యిట్టినైజమునకు ప్రధాన కారణముగ నున్నది. విద్యాశీలములు లేని యైశ్వర్యాధికారముల పట్ల నాయన యెట్లు నిర్లక్ష్యభావముతో నుండెనో తెలుపుట కనేకోదాహరణములు కలవు. ఆయన నిర్భయ నిర్వ్యాజభాషణమును, సత్యగౌరవమును, ఫలనిర్లక్ష్యమును, మనమెఱుంగుదుము అయితే మహాపురుషుని ననుకరించుట క్షేమకరమగునా ? చూత్తముగాక.

ఒకప్పు డొక మహమ్మదీయ నవాబు స్వామి నివాసమునకై తన మందిరము నిచ్చెను. మఱునాడో లేక శీఘ్రముగనో స్వామి యిస్లాము ధర్మము నా నవాబు ముంగటనే ఖండించును. ఆఖండన మెట్టిదో మనము సులభముగనే యూహించుకొనగలము. విద్వాంసుడగు స్కాట్టు బారిల్లీనగరములోని తన క్రైస్తవదేవాలయమునం దుపదేశించుటకై యాహ్వానించును. స్వామి యాహ్వానము నంగీకరించి యుపన్యాస వేదిక నుండి మనుష్యారాధనము దూష్యమనియు దానిని పరిత్యజింపుడనియు నుద్బోధించును. ఉదయపుర మహారాజగు సజ్జనసింగుగారు స్వామియం దధికాదరము కలిగి యాయన యనుచరుడై యుండెను. ఒకప్పు డాయన తన రాజ్యమునందలి యొక సంపన్నమందిరమునకు మహాంతు పదవిని స్వామి కొసంగుదుననెను. దాని కాయన " నేను నీ లక్షలను గాని రాజ్యమును గాని లెక్కచేయను." అని కోరముగా జవాబు చెప్పెను. ఈ విషయముల నిచ్చట ప్రసంగించుట దయానందుని స్వభావమునందలి యీ లక్షణమును నిరసించుటకు గాదు. అది యాయనయం దొక యంశము. ఆయన యుద్యమమునం దొకభాగము. అది యాయనయం దనుకూలముగా నుండి మనోహరమై యొప్పుచుండెను. అయితే ఆయన

ననుకరింప యత్నించు ననుచరులయం దది యెట్లు కన్పట్టును ? సౌంద ర్యమును నైపుణ్యమును శిక్షాసంస్కారముల వలన వచ్చును. గాని యను వర్తనమువలన గాదు. సర్వాంగ శిక్ష లేక యెవ్వనికిని ఆర్యసమాజము వలన గాని యున్నతాదర్శ సహితమగు మఱి యే యితర సమాజముల వలన గాని లాభము చేకూరనేరదు.

స్వామి పాఠశాలల సంస్థాపింపుడని యుద్ఘోషించెను. కాని ఆయన హితబోధ జనసామాన్యము నందు నిష్ఫలమగుట సంతాపకరము. కాశీ, కలకత్తా, లాహోరు, రాజస్థానము ఎల్లయెడలను ఆయన విద్యాలయ ములను నెలకొల్పుటకై గాఢములగు ప్రియత్నము లొనర్చియుండెను. కాని యన్నియు వ్యర్థములయ్యెను. ఈ యపజయమునకు తగుకారణ ము మనకు విదితములే. ఈ విషయమై విచిత్రము లేదు. అది హిమా లయమువలె పురాతనమైనది. మనుజుడు నిరంతరము నెద్దియేని నూతన మును గాంక్షించుచుండును. సమస్త ప్రాక్తన ప్రతిష్ఠాపనములును ఆతని కుజ్జీవప్రదములుగ నుండజాలవు. అయితే విద్యాలయస్థాపనము సామా న్యవిషయము కాదు. అది విశేష ప్రయత్నప్రయాసముల గోరును. ప్రతి వత్సరమును ఈ విద్యాభారమును వహించుటకు వలయు ద్రవ్యమును సహనమును గల మనుష్యులు స్వల్పసంఖ్యాకులు మాత్రమే కలరు.

కాని యీ హేతువులన్నియు నెట్టి న్యత్యాసమును గలిగింపజాలవు. శిక్ష లేక యభివృద్ధియుండజాలదు. ఈప్రధానసత్య మెప్పటియట్ల నిలిచి యున్నది. క్రైస్తవమతము కాని ఇస్లాము ధర్మము కాని ఆర్యసమాజము కాని మఱియేసంఘము కాని ఏమనుష్యుడు కాని ఏయీశ్వరుడుకాని, భవనమునకు పునాదివలె మానవాభివృద్ధికి మూలావశ్యకమగు శిక్షను పరిత్యజించుటకు సహాయపడజాలరు. అభివృద్ధికి రాజమార్గము లేదు జ్ఞాన మునకు మోక్షమునకు క్లుప్తమార్గములేదు.

శిక్షణాలయముల నే — కేవలము శిక్షణాలయముననే హిందూదేశమునకు పునరుజ్జీవనము కలుగగలదని ఆయన యెంతదృఢముగా విశ్వసించు చుండినదియు ఆయన 1879 లో హరిద్వారమువద్ద కుంభోత్సవమున ప్రకటించిన విజ్ఞాపనమునందలి యీదిగువభాగమువలన దేటపడగలదు.

"సూర్యుడు, చంద్రుడు, భూమి, అగ్ని, జలము, దినము, రాత్రి వృక్షము, నేత్రము, నాసికమున్నగున వన్నియు మార్పుచెందలేదు. కాని మనుమాత్రము పరిణామశీలము — అధోముఖముగ పరిణామవశుల మైతిమి మనపతనకారణము మనము నిత్యసత్య కోశమగు వేదోపదేశములకు విరుద్ధముగా ప్రవర్తించుచుండుటయే మన పావనత్వమును మనము మరల పొందవలెనన్న మనపవిత్రగ్రంథానుసారముగ సంచరించుటయే యేకసాధనము, ఆర్యసమాజము చెప్పునది వినుడు. మనపునరభ్యుదయమునకు రెండుమార్గములు కలవు. ౧ విద్యావంతులును, స్వదేశస్వజనానురక్తులును, జ్ఞానార్జనాతత్పరులగు సకలమానవులకును ఉచితముగావిద్యా ప్రదానము చేయుటకు సమర్థులై యాసక్తులగువారును మనోవాక్క్రియలయందు ధర్మవర్తనులునగు ఉపదేశకుల సంఘమును నిర్మించుట (౨) పాఠశాలలను కలాశాలలను స్థాపించుట మాకు దోడ్పడగలవారు ముందంజవేయుడు. అట్లొనర్చుటవలన మన దేశజులకు శీఘ్రపురోగమనమునకై సాహాయ్యము చేసినవార మగుదుము."

ఆయన యార్యసమాజోద్యమ మిటీవల పాంచాలమున గాంచిన యుత్సాహ పూరిత మగు స్వాగతానంతరమునను, దేశపురోభివృద్ధికి విద్యాలయ స్థాపనమే యేక సాధన మను విశ్వాసము లేశమైనను చలింపలేదు. ఒక క్షేత్రమున నెంత విజయము లభించినను ప్రధాన విషయమునుండి యాయన దృష్టిని మరల్పజాలదు.

ఈతరుణమున నాయన యారోగ్యము క్షీణించెను. కావున స్వస్థతకొఱకు డేరాడూను పురమున కరిగెను. కాని యారోగ్యము

లభించలేదు. అయిన ఆయన యెట్లో కొన్ని యుపన్యాసము లిచ్చెను; తత్ఫలితముగ నాయన యాపురమును వీడిన పిమ్మట నవిలంబముగనే యొక సమాజ మచ్చట నెలకొల్పబడెను.

1878 లో ఆర్యసమాజము యొక్కయు దివ్యజ్ఞానసమాజము యొక్కయు స్థాపకులకు గొన్ని యుత్తర ప్రత్యుత్తరములు నడచెను. ఈసమాజములు రెండును ఏకాబ్దముననే 1875 లో నిర్మితములయ్యెను. మొదటి యుత్తరమున కర్నలు ఆల్కాటు దివ్యజ్ఞాన సమాజ మనగా "ఆత్మీయ జ్ఞానోపార్జనా తత్పరులగు విద్యార్థుల" సంఘమనియు "అధిక ప్రాజ్ఞులును, యోగ్యశీలురు నగుటయే వారి యాదర్శ" మనియు నుడివి యున్నారు. వారు తమ సహజ తార్కిక స్వభావమును సంతృప్తి పరుపగలుగున దెద్దియు క్రైస్తవ ధర్మమున గానరామిచే తన్మతావలంబకుల మహా సమూహము నుండి విడివడి ప్రకాశముకొఱకు ప్రాగ్దిశ వంకకు మరలిరి. ఆయన యింక నిట్లు తెలిపియున్నారు. "తమ యను గ్రహమును సానుభూతియు వారికి విశేష సాహాయ్యముగ నుండును. వారు తమ యుపదేశముల కొఱకు తమయందు జేరుదురు. వారు తాము పూనిన పవిత్రోద్యమ నిర్వహణమునందు ఏదియో యొక విధమున తోడ్పడగలరు. ఏలయన వారి వ్యవసాయక్షేత్రము ఆసేతు హిమాచలమును వ్యాపించియున్నది."

తరువాతి యుత్తరములలో కర్నలు ఆల్కాటు ఉభయ సమాజములను సమ్మేళనము చేయగోరెను. అందులకు స్వామి యంగీకరించెను. ఈయుత్తర ప్రత్యుత్తరముల ప్రధానభావము ననుసరించి యీసమాజ ద్వయముయొక్క యాదర్శములందును, ఆశయములందును వ్యత్యాసము గలదని యెవ్వరును సంశయింపజాలరు. 1877 మేనెలలో సహారాన్పురమునందీ యుభయ సమాజ నిర్మాతలును ప్రథమ పర్యాయము గలిసి కొన్నివారము వారి సంబంధ మీతీరుగా నుండెను. వారి

సమావేశ మనో్యన్య సౌమనస్యముతో నిండినట్లు కన్పట్టుచున్నది. వారందఱును జేరి మీరతు నగరమున కరిగిరి. కర్నలుగారును బ్లావట్స్కీ అమ్మగారును అచ్చటి యార్యసామాజికులకు నివేదింపబడిరి. వా రా యమెరికా ప్రేక్షకులకు స్వాగత మిచ్చి విందొనర్చిరి. ఒక్క సంవత్సర మైన గడువక మునుపే వారిలో కలహము జనించెను. ఆ యమెరికా వారు తమ హృదయములను సరిగా గ్రహింపగల్గినచో నీ సమాచార మంతయు జరుగకుండెడిది.

స్వామి యారోగ్యము మఱింత చెడిపోయెను. ఆయన మురాదా బాదులో నుండిన 27 దినములలోను మూడు ప్రసంగములు మాత్రమే చేయ జాలియుండెను. వానిలో నొక్కటి మండల కరగాహి (జిల్లా కలెక్టరు) యాధిపత్యముక్రింద రాజకీయోపన్యాసము.

నాటనుండియు కాలము మారెను. లోక మిప్పు డాయన యుద్యమమునందు రాజద్రోహమును పసికట్టుచున్నది. ఇంతియె కాదు. ఆయన యుద్యమము కేవలము రాజకీయ మనియు, దుష్ఫలమునుండియు శిక్షణమునుండియు నాత్మ రక్షణమునకై యాయన ధర్మము నాచ్ఛాదన ముగ గ్రహించి యుండెననియు వచించువారును గొందఱున్నారు.

ఆయన యిచ్చట ఐరోపీయ వైద్యుడగు డాక్టరు డేను గారి చికిత్సలో నుండెను. ఆయన యుపచర్యకు ప్రతిఫల మొసగ బోగా మానవ కోటి నిమిత్తము శ్రమపడు లోక మహానుభావుని నారోగ్యవంతునిగ జేసినందులకు నేనేమియు స్వీకరింప నని యాయన బదులు చెప్పెను.

ఆయన మరల ద్విగుణి తోత్సాహముతో కృషిచేయ నారం భించెను. బాఱేల్లిలో నుండగా నాయన రెవరెండు స్కాట్టుగారితో పునర్జన్మము, అవతారము, పాపక్షమ ఈవిషయములం గూర్చి దీర్ఘ ప్రసంగములు చేసెను. పిదప షాదాను, ఫరుఖాబాదు, మీర్జాపురము, దినాజపురము, కాశీ, మైనపురము, మీరతు, ఆగ్రా ఈ నగరముల

సన్నింటిని వరుసగా సందర్శించుచు
సంగుచు ఆర్యసమాజములు స్థా
1881 మార్చిలో ఆయన
చ్చట కుపక్రమించెను. ఆయన
దుర్గములయందు పరిచయము కలి
ఆయన బొంబాయి ప్రయాణము
యొక సంస్థానమును తొందర త
ఆయన యిప్పు డచ్చట నొకసువ్యవ
మాహాత్మ్యమును ధర్మచ్యుతియు రాజ
చేసెను. హిందూ సంస్థాన
మునిగి యుండెను

యధాప్రకారముగా న్యుపన్యాసము
ంచుచుండెను.
రాజపుత్రస్థానమున పర్యటన మొక
సాహసికులగు రాజపుత్రులతో వారి
ంచుకొనుట కిదియే మొదలు కాదు.
లలో ప్రతి పర్యాయము నేదియో
ందరగా సందర్శించుచునేయుండెను.
వస్థిత విధానమున కృషిచేయు నెంచెను.
పుత్రస్థానమున దేశ నగునంత చెడుగు
ంతయు సంతాపకరమగు దురవస్థలో
మతము, సంఘము పాలనము అన్నియు దుస్థితి

పాలయ్యెను. ఆ యవస్థ తలంచినంతమాత్రనే నిట్టూర్పు పుట్టించును. కన్నులార గాంచిన దయానందునిలో నెట్టి హృదయ విదారణములగు వికారములు గలిగించెనో మన మూహింపగలుగుదుము. ఆయన తన దైవమునో తన దేశమునో లేక మానవకోటినో యెవ్వరి నతిశయముగ ప్రేమించెనో మనము నిశ్చయము చెప్పజాలము. అధోగతి పాలైన మానవ సంఘము నెచ్చోట గాంచినను వారి నౌన్నత్యమునకు లేవ నెత్తుటకై యాయన గాఢముగా నభిలషించు చుండెను. ఆయన మాతృదేశ మెచ్చట హైన్యము నొంది యవమానము పాల్పడినను ఆయన రక్తము కుతకుత లాడుచుండెను. ఈశ్వరునకు కలంకము గూర్చినను ఆయనను విస్మరించినను దయానందు డొడలు మఱచి పోరాడును.

ఆయన తొలుత సందర్శించినది మసూదా సంస్థానము. ఈరాజ్య
స్తర సంఖ్యాకులుగ నున్న జైనుల నాయన శాస్త్రార్థమునకై
ఉభయ పక్షముల నడుమ గొన్ని యుత్తర ప్రత్యుత్తరములు
కాని శాస్త్రచర్చ మాత్రము జరుగలేదు. రాజా రావు

బహదూరు సింగు గారు రెండు యజ్ఞము లొనరింపగా నచ్చటి జైనులు చాలమంది వానిలో పాలుగొని యజ్ఞోపవీతములను స్వీకరించిరి.

ఈరాజ్యమున ముసల్మాను మతము నవలంబించిన వారికి తమ బాలికల నిచ్చి పరిణయము చేయు హిందూకుటుంబము లనేకములు కలవు. వారు తిరిగి మహమ్మదీయుల వద్దనుండి కన్యకల గైకొనరు. స్వామి యీ తెలివి తక్కువ చేష్టను వారికి తెలియ జెప్పెను. ఈయాచారము వలన ముసల్మాను సంఘము వికాసముతో వర్ధిల్లి హిందూజాతి క్రమముగా రూపు మాయును. ఈయుపాయ కరమగు దురభ్యాస మింతటితో నశించినదో లేదో మనమెఱుగము. రెండు నెల లచ్చట గడపినపిదప స్వామి నబీరా సంస్థానమునకు బయలు వెడలెను. ఈరాజ్యాధీశ్వరున కొక యుత్తమ గ్రంథాలయముండెను. స్వామి అందలి సామవేదముతో తన సామగ్రంథమును సరి చూచుకొని కొన్ని సవరణలు చేసికొనెను. ఈరాజాగారి తనయులు గీర్వాణ భాషా పరిచితులని తెలిసికొని సంతసించెను. వారు సామవేదము నాసాంతముగ పుస్తకాపేక్ష లేకయే పఠింపగలిగి యుండిరి. ఆయన 1881 అక్టోబరులో చిత్తూరునకు జనెను. అక్కడ రాజ ప్రతినిధియగు రిపన్ ప్రభుని సన్మానించుటకై మహాప్రయత్నములు చేయబడుచుండెను. నవంబరు 15 తేదీని రాజ ప్రతినిధి దర్బారుచేసెను. అనంతరము మహారాణాయును ఉన్నతోద్యోగులును సర్దారులును స్వామిని సేవింపగలిగిరి.

బొంబాయి ఆర్యసమాజము యొక్క వార్షికోత్సవము సమీపించుటచే ఇందూరునకు తొందరగా బోయి యచ్చట మహారాజు లేకుండుట గాంచి వెంటనే బొంబాయికి ప్రయాణ మయ్యెను.

స్వామి బొంబాయి వచ్చుటకు సమాజ వర్ధంతి మాత్రమే ముఖ్య కారణము గాదు. మఱికొన్ని ముఖ్యప్రయోజనములును గలవు. బ్రహ్మసమాజముతోడను జైనులతోడను సంప్రతించుకొనవలసిన అంశములు

ప్రాయములు కొన్ని యున్నవి. కూర్త నవే దేశమునం దవతరించి తన యమ్మెరి హాామి మహాత్ముఁడీ తరుణము ఆయన యనుచరులకును స్వామికినిగల కా శిష్యవర్గమును నడపుచుండెను. చుండెను. ఉభయులకును సమాధాన విభేదము క్రమశః విశాల మగు లుదయించెను. అది సహజమే. ఉ ము జరుగుటకు బదులుగా కలహము యైనను వారి సాధనపద్ధతులకు భు భయుల గమ్యస్థానము నొక్కటియె జైనులకును స్వామికిని శాంతముగా వముల కున్నంత యెడ మున్నది. జైనుల ధార్మికాభిప్రాయములు నొ వివాద పరిష్కారము జరిగెను. నియు, సత్యార్థ ప్రకాశము నందు వ ప్పించుట తన యాశయము కాద యంశములు నిజముగా జైన [illegible] గారి కవమానకరముగ వ్రాయబడిన నెడల తానా భాగ [illegible] ధర్మము లేవని వారు ఋజువు చేయు సంతుష్టి [illegible] యును దీసివేయును నని యు స్వామి చెప్పగా వారికి [illegible] కలిగెను. వారిక నేలాటి యిబ్బందులను బెట్టలేదు.

ఈచిక్కులన్నియు విడిపోవుటకు చాలకాలము పట్టెను. కావున స్వామి బొంబాయిలో 1882 జూను వరకు నుండెను.

మరల నొకసారి స్వామిని ఉదయపురమునందు జూతుము. మహా రాణా సజ్జనసింగుగారు అధిక తత్పరుడగు శిష్యుడుగను నిశ్చల చిత్తుడగు అనుచరుడుగను నుండెను. ఆయన యత్యంత భక్తిశ్రద్ధలతో స్వామి ననుదినమును సందర్శించుచు వారి యుపదేశముల నాకర్ణించు చుండెను. స్వామి 1883 మార్చి 4 తేదిని వ్రాసిన లేఖ యం దిట్లుండెను. "మహా రాణాగా రనుదినమును నావద్దకు వచ్చుచు గంటలకొలదిగ గూరుచుం [illegible]. ఆయన నాతో గూడ షడ్దర్శనములయందలి ప్రధాన భాగములను [illegible]లోని పరిపాలనము గూర్చిన మూడధ్యాయములను విదుర [illegible]మునందలి ముఖ్యశ్లోకములను వ్యాకరణము మొదలగు వానిని

స్వామి వారి సూచనపై మహారాణాగారు తమ సంస్థానిక కార్యాలయములందెల్ల నాగరిలిపిని బ్రవేశపెట్టెను.

ఒక వేదపాఠశాలను ఒక రాజకుమార కళాశాలను స్థాపించుటకై స్వామి సంకల్పించి మహారాణాగారితో ప్రస్తావింపగా నాయన యందుల కంగీకరించెను. కాని యీ కార్యక్రమము క్రియారూపమును దాల్చుటకు ముందే స్వామి షాహాపురమునకు వెడలెను. మహారాణాగారు గూడ వ్యాధిగ్రస్తులైరి. ఆయన యిక మరల స్వస్థత చెందలేదు. ఆయన 1884 డిశంబరులో స్వర్గస్థు డయ్యెను.

స్వామి యాయన మరణశాసనము వ్రాయగా నది సింహ దర్బారులో జదువబడి యంగీకరింప బడెను.

షాహాపురాధీశ్వరు డగు రాజా నాహర్‌సింగ్ గారును స్వామి యెడ నధికాదరము గలిగియుండిరి. ఆయన యీ మహాసన్యాసిని దన సంస్థానమునకు జిరకాలము నుండియు నాహ్వానించుచుండినను ఆయన యభిమత మింతకన్న శీఘ్రముగ నెరవేర్చుట కనువు కలుగ లేదు. ఆయన యీ తరుణమును వినియోగించుకొన నెంచి స్వామి యుదయపురమును వీడుటకు మున్నే యాయన కొఱకు తన దూతలను కొందఱిని బుత్తెంచి యుండెను.

స్వామి యా రాజ పురుషులతో షాహాపురమునకు బోయెను. ఆయన యచ్చట నెదుపక్షములు గడపెను. అతడు స్వామి సాన్నిధ్యమును చక్కగా వినియోగించు కొనెను. ఆయన స్వామిచెంగట మనుస్మృతిని యోగశాస్త్రమును వైశేషికమును జదివెను. ఆయన ప్రాణాయామమును గూడ నభ్యసించెను.

# నవమాధ్యాయము

## నిర్యాణము

నేను మహారాజా సర్ ప్రతాపసింగన బరగు మహారాజా ప్రతాపసింగు గారి యాహ్వానముపై స్వామి 1883 మే 26 వ నాడు జోధపురమునకు వెడలెను. అచ్చట ప్రధానమంత్రియగు మియాన్ ఫైజుల్లా ఖానుగారి మందిరమున విడిది చేసెను. ప్రతాప సింహ మహారాజుగారాయనను విశేష భక్తి తాత్పర్యములతో సందర్శించిరి. కాని జోధపుర పాలకుడగు జస్వంత సింహమహారాజుగారాయనను పదునేను దినముల వరకు దర్శన మొసంగక పోయెను. స్వామియే ప్రప్రథమమున తన దర్శనముచేయుటకై యాయన వేచియుండెనట. ఎట్లయిన నేమి పట్టుదల వచ్చిన పిమ్మట మహారాజుగారి భవనమున వరుసగా కొంతకాలము స్వామివారి యుపదేశములు జరిగెను.

మహారాజునకును స్వామికిని ప్రారంభము నుండియు పరస్పరాపగ్రహణ ముండినట్లు కొన్ని యాధారముల వలన దెలియుచున్నవి. ఆ మహారాజు తన దైవమున్నను దేశమున్నను ఈమణ్మాత్రిమేని యాదరము [illegible] భోగపరాయణుడని స్వామి భావించి యుండును. స్వామి స్వసామర్థ్య [illegible]రంతలు కొండంతలుగ దలపోసి మహారాజులం గూడ దన యం[illegible]ందికి దేనెంచిన గర్వోద్రిక్తుడగు నహంకారి యని మహారాజు [illegible]ంచి యుండనోవును.

స్వామి దయానంద సరస్వతి

ఈక్రింది యుత్తరము వారి మనోన్నత్య మై మనస్వమునకు ప్రబలసాక్ష్య మిచ్చుచున్నది.

సన్న్యాస్యులు ధీర వర్యులు నగు ప్రతాపసింహ మహారాజుగారికి:—

సుఖీభవ—ఉదాత్తుడగు జోధపుర పాలకు డలసుడై యుండుట చూడ నాకు చాల విచార మగుచున్నది. మీరును బాబాసాహేబును అనారోగ్యముచే బాధితు లగుచున్నారు. తమ యదృష్ట దురదృష్టముల కై మిమ్ములనే నమ్ముకొనియుండు పదునారు లక్షల జనమండలి కలిగి యున్నది యీరాజ్యము. దీని క్షేమము నారయుచు సంరక్షించుచుండ వలసిన మీరు మువ్వురును మీ శరీరములు నామయమునుండి కాపాడుకొను నటులను మీ యాయుష్కాలము నాయదము చేసికొనుటకును శ్రద్ధ బూన కుండుట యెంతయు సంతాపకరము. మీరు మీనిత్య కర్తవ్యములను నావద్ద నభ్యసించెదరని కోరుచున్నాను. అట్లొనర్చితిరేని మీరు మార్వారు నకే కాక యఖండ భారతవర్షమునకును శ్రేయ మొనర్ప గలుగుదురు. మీ వంటి మహనీయు లీప్రపంచమున గడు నరుదుగ మాత్రమే యుందురు. ఉన్నవారు చిరకాలము జీవింపరు. దీర్ఘాయువు లేనిచో నెవ్వడును తన దేశమునకు మేలు చేయ జాలడు. గొప్ప వారెంత చిరకాలము జీవించిన దేశమున కంతలాభము చేకూరును. ఇది మీదృష్టి నాకర్షింప వలసిన విషయము. తక్కినవానివిషయమై మీయిచ్చవచ్చినట్లు చేయుడు.

సూచిక—ఈజాబు శ్రీబాబాసాహేబునకు (గజసింహమహారాజు గారు) జూపుడు.

(దయానందసరస్వతి)

జోధపురము, అశ్విని, 3 శనివారము ౧౯౪౦ (22-9-18

పై యుత్తరము 1883 సెప్టెంబరు 22 తేదీని వ్రాయబడినది. స్వామియుద్దేశ్యము వీలగు నంత త్వరలో—ప్రాయకముగ నొకవారము లో యోధపురము వీడుటయైనట్లు కానవచ్చుచున్నది. కాని 29 తేదీని స్వామి వ్యాధిగ్రస్తుడయ్యెను మఱునాడు డాక్టరు సురాజమల్లుగారు వైద్యోపచారము కావించిరి. కాని యాయన కారోగ్యము కలుగలేదు. ప్రతాపసింహ మహారాజుగారి యాజ్ఞానుసారముగ డాక్టరు అలీమర్దన ఖానుగారు చికిత్సచేయ నారంభించిరి. కాని వ్యాధియతిశయించు చుండెను. ఒడలంతయు బొబ్బలలముకొనెను. అయినను 14 తేదీవరకును మామూలుగారే యుపచారము చేయుచుండిరి, స్వామికాచికిత్స సంతృప్తికరముగ నుండలేదు. అయినను చేయునదేమి? ఆయన నిస్సహాయుడై యుండెను. ఇంతదనుక నీసమాచారము దేశమున ప్రచురము కాలేదు. ఒకఆజ్మీరు ఆర్యసమాజికుడు అక్టోబరు 12 వ నాడు రాజపుతానా గెజిట్ లో స్వామి యామయ గ్రస్తుడయ్యె నన్నవార్త చదివెను. తోడనే యథార్థము నెఱుంగుటకై యొకమనుష్యుడు జోధపురమునకు పంపబడెను. ఆవార్త ధృవపడిన తత్క్షణముననే యితరమండలములందలి నానాసమాజములకును తంతిమూలమున దెలియజేయబడెను. 15 వ తేదీనాటి కాయనయందభిమానముగల మిత్రమండలమును శిష్యవర్గమును ఒక్కరొక్కరే రాదొడగిరి. వెంటనే చికిత్సలో మార్పుచేయుటకు నిశ్చయింపబడెను. అందుచే 15 వ తేదీని డాక్టరు ఆడంగారు రప్పింపబడిరి. ఆయన స్వామిని తత్క్షణమే అబూశిఖరమునకు గొంపొమ్మని సలహా యొసంగెను. మహారాజుగారి కిది యసమ్మతముగ నుండెను. ఐనను అచ్చటి వాతావరణ [illegible]న స్వామివారు సత్వరమే సుఖులగుదురను నాశచే తనయంగీకారమును [illegible] స్వామి 16 తేదీని యోధపురము వీడి 21 తేదీని అబూశిఖర[illegible]ను. డాక్టరు లక్ష్మణదాసుగారి యుపచారమువలన స్వామికి [illegible]స్వత కలిగి మరల జీవితాశ యంకురించెను. కాని యాభిషగ్వ

రుకు పోవలసినది విధాయక మగుటచే నటనుండి * వెడలిపోయెను. ఇంతలో మరల రుగ్మత హెచ్చెను. 23 తేదీని ఆయన మిక్కిలియలసిపోయి మాటాడజాలనంత నీరసస్థితిలో నుండెను. తరువాత రెండునాళ్లు డాక్టరు ఆడంగారును డాక్టరు లాలాగురుచరణదాసుగారును మహారాజుగారిచే నియుక్తులయి స్వామికుపచారము గావించిరి. 26 వ తేదీని ప్రతాపసింహ మహారాజుగారాయనను జూడవచ్చిరి. లాహోరు, అజ్మీరు, కాన్పురము, మీరతుమున్నగు నగరములనుండి యాయన యభిమానులు పెక్కండ్రు రుదెంచిరి. వారాయన స్థితి నానాటి దుర్భరమగుచుండుట గాంచి భీతిల్లి లక్ష్మణదాసుగారు కొంతయాన వెలిబుచ్చియుండుటచే నాయన చికిత్సలో నుంచుటకై స్వామిని అజ్మీరునకు గొనిపోయెంచిరి. స్వామియు నందుల కెట్టులో తనయనుమతి నొసెంగెను. ఆయన శీఘ్రయానమున 27 తేదీని ఆజ్మీరున బ్రవేశించెను. లక్ష్మణదాసు గారు తనసర్వశక్తులకు బ్రయోగించి పనిచేసిరి. కానియంధకార బంధురములగు నాయనమిత్రులయొక్కయు, భక్తులయొక్కయు, శిష్యులయొక్కయు, అనుచరులయొక్కయు, అభిమానుల యొక్కయు, హృదయములయందొక్క యాశాకిరణమేని

* శ్రీయుతయాదిపూడి సోమనాథరావుగారు తమవిరచితమగు స్వామివారి చారిత్రమునందిట్లు వ్రాసియున్నారు:—“ ఆసమయమున పంజాబు దేశస్థులును ఆర్యసమాజపు సభాసదులునగు డాక్టరు లక్ష్మణదాసుగారు అజమేరునకు మార్పబడిపోవుచు మార్గమున ఆబూపర్వతమునందు దిగియుండుట తటస్థించియున్నందున, శ్రీస్వామివారిని జూచిన తోడనే చికిత్సచేయ నారంభించి, తనకునొక నెలసెలవియ్య వలసినదని సర్కారువారికి నర్జీపెట్టుకొనిరి. కాని దానికి సర్కారువారు సమ్మతింపలేదు. అందుమీద నతడు రాజీనామా దాఖలు చేసెను. దానిని సర్కారువారు అంగీకరింపలేదు. ఇంతలో లక్ష్మణదాసుగారిచ్చిన యౌషధము వలనను జేసిన యుపచారము వలనను శ్రీస్వామి దీర్ఘ యుపశాంతి తోచెను కాబట్టి లక్ష్మణదాసుగారు శ్రీస్వామివారిని అజమేరుకు, కాని రావలెనని శ్రీస్వామివారి శిష్యులతో జెప్పి విధిలేక అజమేరునకు వారైరి. ఆహా! ఇదిగదా నిజమైన గురుభక్తి:—

